


ఆధునిక సాహిత్య వేదిక

# 15

మే 1970

నిర్వాహణ

సాహితీమిత్రులు

106 పేజీలు రూపాయి పావల

ముఖపత్రం : మే డే

రచన : ఎస్. కె.

ఈ సంచిక రూపాయి పావల

సంవత్సర చందా ఐదు రూపాయలు

ప్రతులకు, వివరాలకు :

సృజన
పోస్ట్ బాక్స్ 67, వరంగల్–2

ముద్రణ :

కమల్ ప్రింటర్స్
బాకారం, హైదరాబాద్–20

ఆధునిక సాహిత్య వేదిక

# సృజన

మే - జులై 1970 15

★ సృజన కథల సంచిక (సెప్టెంబర్ 1969) లో అత్తలూరి నరసింహారావు (ఎం. ఏ. తృతీయ, ఎస్. వి. యూనివర్సిటీ) రాసిన 'వీడ్కోలు' అనే కథను 1969 లో వచ్చిన ఉత్తమ కథగా నిర్ణయించి సృజన పాఠకులు ఏభై రూపాయల బహుమతి ప్రకటిస్తున్నారు. రచయితకు సృజన అభినందనలు.

★ అదే సంచికలో 'పేదవాడి పెదవి' కథ రచించినవారి పేరు 'కాటూరి రవీంద్ర త్రివిక్రమ్' అని చదువుకోవాలి.

★ సృజన శ్రీశ్రీ సాహిత్య సమాలోచన (ఫిబ్రవరి 70) సంచికలో నవీన్, శ్రీపతి, వరవరరావు శ్రీశ్రీతో జరిపిన ఇంటర్వ్యూలో యీ క్రింది ప్రశ్న, జవాబు ఎగిరిపోయాయి.

ప్రశ్న : 'నక్సలైట్లు' లేస్తామంటున్న సాయుధ విప్లవాన్నిగూర్చి మీ అభిప్రాయమేమిటి ?

జ : నక్సలైట్లు మేమే నిజమైన మార్క్సిస్టులమని చెప్పుకుంటున్నారు. కాని లెనిన్ చెప్పినట్లు వాళ్ళది infantile adventurism మాత్రమే. సాయుధ విప్లవం రావటానికి అనువైన పరిస్థితులు ఈ దేశంలో ఇంకా ఏర్పడలేదు. Out of sheer disgust and frustration నక్సలైట్లు సాయుధ విప్లవానికి దిగారు. ఎన్నో వికసించాల్సిన జీవితాలు waste అయిపోతున్నాయన్న బాధ కలుగుతుంది నాకు.

★ శ్రీశ్రీ సాహిత్య సమాలోచన సంచికలో అచ్చుతప్పులు- అందులోనూ కొన్ని అర్థాలే మార్చే అచ్చుతప్పులు దొర్లినందుకు విచారిస్తున్నాం.

★ ఈ సంచికలో 'లెనిన్' కవితలో ఏడవలైన్ లెనిన్ ఇ=ఎమ్ సి[2] అని చదువుకోవాలి.

— సాహితీ మిత్రులు

# లెనిన్

శ్రీశ్రీ

భూకంపాల మూల కేంద్రాన్ని
ఖచ్చితంగా పట్టియిచ్చే సీస్మోగ్రాఫ్ [1]
సీల్ చేసిన వ్యాగన్లో డైనమైట్
విప్లవానికి మంత్రసాని
మనిషి, మనీషి లెనిన్.

లెనిన్ విద్యుత్తు
లెనిన్ ఇ - ఎసి 2 *
లెనిన్ యిప్పుడు
లెనిన్ ఎప్పుడూ.
లెనిన్ ప్రేమ
ప్రతి మనిషీ లెనిన్.

భూమి అణువయితే
లెనిన్ కాస్మిక్ కిరణం
భూమి కలువయితే
దాని పరిమళం లెనిన్
ప్రపంచమొక కావ్యమయితే
దాని అర్థం లెనిన్
జీవితమొక సమస్యయితే
దాని పరిష్కారం లెనిన్.

1 భూకంపాన్ని కొలిచే యంత్ర సాధనం.
* సాపేక్ష సిద్ధాంత మూలసూత్రం.

సృ జ న

మనిషి సముద్రమయితే
అందులో కనిపించకుండా దాగిన
ద్వీపం లెనిన్.
మనిషి కనిపించని ద్వీపమయితే
దాని ఎర్రని కాంతి లెనిన్.

ఆయనకు నూరేళ్ళు
నిండాయని కాదు
ఆయనకు నా సాల్యూట్
భవిష్యత్ రక్తారుణ నగ్నశిశువు
ఆయనింకా పుట్టాల్సేవున్నది.

ఆయన మన ఆశ
అందుకని నా వందనం
ఆయన మన ధ్రువతార
అందుకని నా జోహార్లు

ఇది నిజం
దీన్ని బిగ్గరగా ప్రకటించనివ్వండి.
ఎన్నో యిజాలున్నాయి
అవన్నీ నిజంకావు
లెనినిజం, కమ్యూనిజం
మానవిజం నిజం.
ఆయన పేరు
నిజానికి పర్యాయపదం.

అందుకే
నా జోహార్.

[ఇంగ్లీషులో శ్రీశ్రీ రాసిన గీతానికి అనువాదం]

# అగ్నిలో పోరాటం నా బ్రతుకు

యాదగిరిరావు

గాలిలో గడ్డిపోచనికాను
గుడ్డిదీపాన్నై అడమైనదేవుళ్ళని వేడను
విద్యుత్తుని
పృథ్వినరాలు వెలిగేశక్తిని
సముద్రం నాదేహం
తుఫాను నాశ్వాస
అరచేతిలో గ్రహాల నాడిస్తా
ఈ గోళాన్ని పడుతూన్న చెదపురుగుల
అరికాలితో రాచేస్తా
నా మెదట్లో దూకే జలపాతాలతో
ఇక్కడి బురదని కడిగేస్తా
సూర్యుడు నా ఆహారం
లావా నా నెత్తురు
అగ్నిలో పోరాటం నా బ్రతుకు

# హా కుర్రా

నెల్లుట్ల వెంకటేశ్వరరావు

కష్టం చేసిన తర్వాత
కాళ్లు పట్టుకోవడం దేనికి ?
స్వేద బిందువులు చిందించిన తర్వాత
చేతులు జోడించడం దేనికి ?
నీవడిగేది బిచ్చంకాదు
నీవు కోరేది దానంకాదు
చేసిన శ్రమకు ఫలితం
చేయించుకొన్న పనికి మూల్యం
ఐనా, కూలీ యిమ్మని అడిగే కాలం
ఏనాడో కూలి పోయింది
ఇప్పుడడగాల్సింది వాటా
కాళ్లు పట్టుకొనే జనం
చేతులు జోడించే జాతి
వేరేవుంది——
పూరి గుడిసెల్లోకాదు
ఊరిబయట చెట్ల నీడల్లోకాదు
అందాల అబద్ధాల అద్దాల మేడల్లో
పసందైన రంగురంగుల పదవుల బురఖాల్లో

హక్కు

నువ్వాపని మాత్రం చేయకు
శ్రామికజాతి పరువుతీయకు
నువ్వుపట్టాల్సింది కాళ్లుకాదు
నున్నగా పెరిగిన కొవ్వెక్కిన శత్రువును
నువ్వు చేతులను జోడించకూడదు
పిడికిలిని బిగించాలి–
విరగ్గొట్టాలి తరతమాలను
లే! ఉక్కును ముక్కలుచేసే
శక్తిగల నీ కరాల
ఒక్కసారి కదిలించు.
లే! బానిస బరువులుమోసే
గాడిదలా బతకకు
దోచుకోబడ్డ హక్కులను సాధించు.

# హింస ? !

కోపం ఉంటే వీపుమీద
కొట్టు పోయిందు......
పొట్టమీద కొడతావా? 'పా'పిష్టి ... అన్నద
జనపదాల నానుడి;

అందుకే
ఆకలితో చావడం కన్నా పోరాటంలో మరణించడం మిన్న...
అని బోధిస్తే
దోచుకు దాచుకునే కష్టజీవి కూడూగుడ్డా, కన్పించక
ఇది హింసంటారు హింస......
కష్టందోచుకొని...కనీసవసరాలుదోచుకొని
వీపుమీద కాక పొట్టమీద కొట్టి లాభా లార్జించే
ఘటాచోరుల ముక్కులు తెగ్గోస్తే...
కోసినముక్కే చూపిస్తారుగాని చేసినతప్పు కన్పించనీరు...
చలికీ ఆకలికీ వణికి
ఎండకూ వానకూ తల్లడిల్లి
సగం జీవం, సగంజీవితం గడుపుతూంటే...
—గడుపుతున్నారా, కాదు వట్టిది,
మెడలోంచి గడిపిస్తూంటే—
దానిపేరు ఖర్మం శేఖర్మే...అది హింస కాదంటారు—
ఇదికృత్రిమం—
ఇది అన్యాయం అక్రమం,
నీఅంతుతేల్చి కోరలు పెరికేస్తామంటే
అరె...అది హింసంటారు హింస !

ఒక్కడు వందమంది బతుకుల్ని గుప్పిట బిగించడం హింసకాదు
అది పూర్వజన్మ సుకృతం
ఒక్కడి గొంతుక తెగ్గోసి వంద బతుకుల బంధనాలు తెంచడం
అది నేరం అది హింస రాక్షసత్వం దుర్మార్గం......
ధర్మ సంస్థాపనార్థం జన్మించిన దేవుడు
ప్రతిఅవతారంలోనూ గొంతులు తెగ్గోశాడన్నది నిజం...
ఎవడో ఒకడు వరాల బలమున్న దేగగాడూ
వాడి అనుచరులూ సహచరులూ
బహుళ అమాయక జనం బతుకుల నంజుక తింటూంటే
అవతారం చేసిన పని విని దొంగలు ఆహా అంటున్నారు
అంటే గొంతుల్ని తెగనరకడం హింసకాదు...
నరక్క దుర్మార్గం పెరుక పోనీయడం హింస.
మనంమాత్రం పీడకుల్ని కాకపోతే
పీడితుల్ని చంపేస్తామా?.........
ఏటివాలుకి కింద తాగుతున్న మేకదే తప్పంటుంది పులి...
ఎట్లా మేకదే తప్పో చెప్పే విపుల గ్రంథరాజాలే...
ఈ దొంగల శాస్త్రాలు, పురాణాలు, శాసనాలు...
మేకలకి పౌరుషం వస్తే, కరుకుకత్తుల్ని నూరి పులినెత్తురు
చవిచూస్తే,
అది హింసని ఏ దేవతలన్నా అంటారా?......
అంటే చంపడం తప్పుగాదు, జీవచ్ఛవంలా బతికి,
బడుగుల్ని భ్రష్టుల్ని కనడం తప్పు,
అంటే నిస్సహాయంగా కన్నీరు కార్చడం తప్పుగాని
వికాసంకోరకు నెత్తురు చిందించడం తప్పుగాదు.
వందపూలు పూయనీకపోతే,
వంద చిగుర్లు వేయనీకపోతే,
తెగులు మీద మందులు చల్లడం తప్పా ?

# క ల

అమ్మూరి రంగారావు

కలగన్నానొక కలగన్నాను
కలలో స్వర్గం కనుగొన్నాను

కార్మికులు లేరచట
కర్షకులు లేరు
రచయితలు లేరు
సైనికులు లేరు
అంతా మానవులే
అగుపించారక్కడ.

ఒకొక్కరూ ప్రతిఒకరూ
హాలంపట్టి దున్నగలరు
మరను త్రిప్పి నడపగలరు
తుపాకీని పట్టగలరు
ఏదో రచన చేయగలరు
ఒకొక్కరూ ప్రతిఒకరూ.

ఇది యితనే చేయగలడని
యిది యీమే చేయాలని
ప్రత్యేకత లేనేలేదు.
అవుసరానికనుకూలం
ఎవ్వరేది కావాలంటే
అదే వారు చేయగలరు.

కొందరు చేసేవారు
కొందరు చేయించువారు
ఒకరు చేయనివారూ
భేదమస ల్లేదక్కడ.

అంతా పనిమంతులే
అందరికోసం అందరు
కార్యక్రమ నిమగ్నులే.

పాఠ్యపుస్తకాల్లేవు
లెక్చర్లసలే లేవు
విద్యార్థులు బోధకుడు
కలసి చర్చ జరపుతారు

పరీక్షలంటూ లేవు
పైకిపైకి చదువుకుంటూ
చదివిందాన్నాచరిస్తు
విజ్ఞానాన్నార్జిస్తూ
పోవటమే విద్య.

పనిచేస్తూ చదువుతారు
చదువుతునే శ్రమిస్తారు.

చదువుకొనే విద్యార్థీ
కొంతసేపు పాకీ మనిషి
పాకీపని చేసే అతనూ
వ్యాసాలో గేయాలో రచిస్తాడు.

అణుశాస్త్ర పరిశోధకుడూ
వారితోటి పనిచేసాడు.

హాలంపట్టి దున్నేవాడు
నాట్యకళల బోధిస్తాడు.

బాల బాలికలు
నీ నా అని వేరులేరు
పుట్టిన ప్రతి పాపా
అందరి పాపాయే.
అంతా అందరి పాపల పోషకులే
ప్రతి పాపకు ప్రతివ్యక్తి తనవారే

నా కల కలకాదంటే
వాస్తవ జగత్తులో
సాధ్యం, అది నిజమవునంటే:
భూగోళం పై ఎచటో
అది వుండే తీరిందంటే:

నిజమని రుజువయ్యేందుకు
సాక్ష్యాలెన్నో వున్నయ్
యీ మన దరిద్రపు
పత్రికలే చెబుతున్నయ్.

# ఎదిరించక తప్పదు

రామప్ప

నన్ను కనిపెంచిన తండ్రీ!
నువ్వు నాకళ్ళ కొక గుత్తాధిపతిలా కనిపిస్తున్నావు

నువ్వు పుత్రవాత్సల్యం పేర చేసే పనులు
నా స్వేచ్ఛను సాహసాన్ని అరికట్టడానికి
నువుపెట్టే పెట్టుబడులు

నీ తరం కుళ్లును
పరపీడన మార్గాల్ని, అన్యాయాల్ని
ఆకలిని, బరువును, భయాల్ని
నిరాశ, నిస్పృహ, చీకట్లను
వారసత్వంగా నా నెత్తిన రుద్దే
నీ రహస్యం తెలుసుకోలేననుకోవటం
నీ బుద్ధితక్కువతనం.

నేను చిన్నవాణ్ణి కాజూసి
ఇంతకాలం నా మెడలు వంచి
నా తలలో నీ దుర్గంధం దించి
నా మెదడు తుంచి, గుండె చించి
వీపు విరిచి, ఆశలు చెరిచి
నీవేదో గొప్ప అధికారిలా
నేనేదో నీ బానిస నైనట్టు
నోరెత్తని మూగ విధేయునిగా
నన్ను అణచిపెట్టే నీ కుట్ర లింక సాగవు.

తరతరాలుగా శతాబ్దాలుగా
నీవేదో నన్ను కన్నావని

నీ ఋణంలో పడి తిన్నానని
ఈ భూమ్మీద నీ వల్లనే ఉన్నానని
వడ్డీ వ్యాపారస్తునిలా
నన్ను నీ ఖాతాదార్ల జాబితాలో ఎక్కించుకుని
మన మధ్య సంబంధం
వడ్డీ లెక్కల వ్యవహారానికే పరిమితం చేసుకున్నావు.

నీకు జరిగే అన్యాయానికి సైతం
తిరుగబడే ధైర్యంలేని పిరికి దద్దమ్మవయి
సంఘభయాన్ని పెంచుకున్న నువు
ధర్మరాజుగా చలామణి అయ్యే
రోజులింక లేవు.

నువు నీ పాత తరానికి బానిసవై, నాశనమై
నా స్వేచ్ఛను సాహసాన్ని ఆమోదించని ఈర్ష్యతో
నా నెత్తిన నీ తరంబురద రుద్ది
నా నెత్తిన నీ బండలెత్తి
నా నడ్డి విరగ్గొట్టి
నాకూ నీ బానిస లక్షణాలు అంటించి ఆనందించాలని చూసే
శత్రువా, ఖబర్దార్.

నంగి మాటల దొంగ వంచకునివి
కొడుకుమీద గుత్తాధిపత్యం చేసే పెట్టుబడిదార్
ముందుచూపులేని గుడ్డి గవ్వవు
పేడ పురుగువు పెంట మురుగువు విషక్రిమివి.

ఈ లోకంలోకి కళ్ళు తెరిచి దారివెతుక్కునే నన్ను
పెడమార్గం పట్టించి
నా స్వేచ్ఛా సాహసాల్ని భస్మంచేసి
లొంగదీసుకునే నీ ప్రయత్నం ఇక సాగదు.

# సాయుధ కవితోద్యమానికి పిలుపు
# 'తిరుగబడు'

ఆర్. వి. బి. శర్మ

ప్రగతిశీల సాహిత్యోద్యమంలో కొంతకాలంగా ఆవరించిన స్తబ్ధత ఇటీవల మహాకవి శ్రీశ్రీ షష్టిపూర్తి ఉత్సవం సందర్భంగా జరిగిన సభలు, సదస్సులు, వెలువడిన ప్రత్యేక సంచికలవల్ల కొంత తొలగిపోయింది. ప్రగతిశీల సాహిత్యం అంటే ఏమిటి? అభ్యుదయ రచయితలమని చెప్పుకొనేవారి కర్తవ్యం ఏమిటి? రచయితల సామాజిక బాధ్యత కేవలం సృజనాత్మక కృషికే పరిమితంగా ఉండాలా లేక తాను ప్రబోధించే లక్ష్యాల సాధనకై జరిగే పోరాటాలతో ప్రత్యక్ష సంబంధం కలిగిఉండాలా? — మొదలుగాగల మౌలిక ప్రశ్నలన్నీ తిరిగి రచ్చకెక్కాయి.

ఆయావేదికలపైన, విభిన్న పత్రికల వ్యాసపరంపరలో వివిధదృక్పథాలు కలవారు తమతమ వాదాలను ప్రతిపాదించారు. తెలుగు సాహితీరంగంలో అభ్యుదయ సాహిత్యోద్యమం తొలుత కమ్యూనిస్టు తాత్త్వికదృక్పథం, కమ్యూనిస్టు ఉద్యమాల ఉత్తేజంతో ఆవిర్భవించి, సామాజిక వ్యవస్థా స్వరూపాన్ని ఆమూలాగ్రంగా మార్చివేయడానికి సాగుతూ వచ్చిన ఉద్యమంలో అంతర్లీన వాహినిగా ఉంటూవచ్చినవనేది ప్రప్రథమంగా చెప్పుకోవలసిఉన్నది. ఈ మౌలికాంశం దృష్టిలోకి తీసుకోకపోతే నేటి సాహితీ వేదికలపైనుండి వినవచ్చే స్వరమేళ అర్థంచేసుకోవడం సాధ్యంకాదు. ఈ విభిన్న సాహిత్య ప్రతిపాదనలు సమకాలీన వామపక్ష రాజకీయాలలోని వేర్వేరు దృక్పథాలను సాహితీ పదజాలంతో ప్రతిధ్వనిస్తున్నాయి.

## అభ్యుదయ సాహిత్య ప్రస్థానం

"మహాప్రస్థానం" పూరించిన శంఖారావంతో జాగృతమై, "నయాగరా" జలపాతవేగంతో సాగి "త్వమేవాహం" "తెలంగాణా"లతో "ప్రతివెయిన్‌లో

మెషిన్‌గన్ రెయిన్"లు కురిపిస్తూ సమరోన్ముఖమై ఎంతో ఆశగొలిపిన అభ్యుదయ కవిత 1950, 60 దశాబ్దాల పార్లమెంటరీ మాయావాగురలో చిక్కుకొని ఎన్ని కల ప్రచారగీతాలనే ఆధునిక "పంచరత్నాల" వ్యాసంగాన్ని అవలంబించి, చెట్టుకొకరు పుట్టకొకరుగా చెల్లాచెదరై సినిమాల విశ్రృంఖల శృంగారవాణియై అభినవ ప్రబంధబంధితయై, అకాడెమీలు, విద్యాలయాల వేడుకలు, ప్రభుత్వాధి నేతల వినోదార్థం జరిగే కవిసమ్మేళనాలలో దుశ్శాలువలు కప్పుకొని పెద్ద మనిషి తరహా సంతరించుకొని రాజ్యవ్యవస్థ లావాదేవీలతో వాటాదారైనది.

పెద్దతరం శక్తులుడిగి వాణి మూగపోయింది. కొత్తతరం స్వార్థప్రేరిత విలువలతో పైరవీ ప్రధాన వ్యాపకంచేసుకొని వ్యసనాలకు బానిసయై నిర్లజ్జను తిరుగుబాటుగా చిత్రించచూస్తున్నది. నూటికోకోటికో ఒకరు "విషాద భారతా"న్ని వేలెత్తిచూపినా అభ్యుదయ సాహితీ వనంలో పూలమొక్కలకన్నా కలుపు మొక్కలే ఎక్కువైపోయాయి.

## నవశక్తుల ఆవిర్భావం

1960 దశాబ్దపు చివరి పాదంలో రాజకీయాలలో "నెత్తురుమండే శక్తులు నిండిన" నవశక్తులు ఈ దేశపు మారుమూలల్లో, కీకారణ్యాలలో ఆవిర్భవిం చాయి. అధర్మంపై అక్రమదోపిడిపై కత్తికట్టి నిలచాయి. పట్టణాల్లో నగరాల్లో విశ్వవిద్యాలయాల్లో కాలేజీల్లో విద్యార్థులు నిరాశానిస్పృహలవల్ల అయోమయులై ధిక్కారభావాన్ని ప్రదర్శింపజొచ్చారు. వియత్నామ్ ప్రజల మహోజ్జ్వల పరాక్రమం కొందరినిఒకవిధంగా ఉత్తేజపరచి కార్యోన్ముఖులనుచేయగా సంపన్న పశ్చిమ దేశాలలో సంప్రదాయ నిర్మూలనోద్యమంగా చెలరేగిన లక్ష్యంలేని తిరుగుబాటు మరికొందరికి మరొకవిధంగా ఉత్తేజంకలిగించి సాహితీ వ్యాసంగా నికి పురికొల్పినది. ఇదీ మనవర్తమాన సాహిత్య దశకు పూర్వరంగం.

## భ్రమలు తొలగి కార్యోన్ముఖత

రాజకీయాలలో పార్లమెంటరీ తతంగం, విప్లవవాద పార్టీలనే లేబిల్స్ తగిలించుకొని వోట్ల తిరునాళ్లలో వీరంగంవేయడానికీ, జయంతులు, వర్ధంతు లకూ తమకార్యకలాపాలను లాభసాటిగా పరిమితం చేసుకుని చెలామణి అవు తున్న పార్టీలపై భ్రమలు క్రమేణా తొలగడంతో నవశక్తులు విప్లవధ్వజాన్ని

చేబూని, పాతనాయకులను త్రోసిరాజని పోరాట ప్రస్తావానికి ఉపక్రమించినట్టే, ఒకనాటి అభ్యుదయ సాహిత్యమహారథులు పెట్టుకున్న ఆశలు ఎంతకాలం వేచిచూసినా ఫలించక పోవడంతో సాహితీ రంగాలలోకూడా నవతరం నవవాణితో ఎలుగెత్తి రంకెవేసినది. అంతకు పూర్వం ధరియించిన ఛద్మవేషాన్ని, మర్యాదల విలువలను విసరిపారేసి "తిరగబడు", "ఈ కుష్ఠువ్యవస్థని సమూలంగా నాశనంచేయి" అంటూ పిలుపు నిచ్చినవి. ఇంతనూటిగా విప్లవానికి కవితలో పిలుపు వినరావడం అపూర్వమైన పరిణామం.

## "దిగంబర" కవిత్వం

ఇటీవలి కాలంలోని తెలుగు కవితలో "దిగంబర కవిత్వం" రేపినంతగా దుమారం లేపిన, సంచలనం కలిగించినది మరొకటిలేదు. దానికి అనేక కారణాలున్నాయి. పాతట్రేడ్‌మార్కులకు గిరాకీ లేదని గ్రహించి తాము దిగంబరకవులమన్నారు. తమ గేయ ఖండాలను దిక్‌లన్నారు. సొంతంగా సొంత పదజాలం సృష్టించుకొన్నారు. పలుకులో బలం చాలదని ప్రచారపు ఎత్తుగడలు నవ్యంగా లేకపోతే నలుగురి దృష్టిని ఆకర్షించడం కష్టమని గ్రహించి తమ సంకలనాల ఆవిష్కరణ విషయంలో కొత్త పద్ధతులను అనుసరించారు. అంతమాత్రాన ఈ చిట్కాలవల్లనే దిగంబర కవులకు ఆదరణ లభించినదంటే- అంతకుమించిన అసత్యం ఉండబోదు.

ఇంతవరకు వివిధ రంగాలలో గౌరవంగా పీఠాలు ఏర్పరచుకొని పెత్తనం చలాయిస్తున్న వారిపైకి సెర్చిలైట్ తిప్పి వారి నగ్నస్వరూపాన్ని చూపారు. ఈసమాజాన్ని దిగంబరంచేసి, జుగుప్సాకరమైన వికృతాలను, వ్యాధిగ్రస్తమై కుళ్ళి కంపుకొడుతున్న సమాజ అంగాంగాలను దిగంబరకవులు చిత్రించారు. ఎవరినీ స్పేర్ చేయకపోవడం వారి ప్రత్యేకతగా చెప్పాలి.

దిగంబర కవులు తమకవిత్వం అంతకు పూర్వం ఉన్న ఏకవితోద్యమంలో భాగంకాదనీ, పూర్వపు కవితారూపాలతోకూడా తమకు పొత్తులేదని చెప్పుకొన్నా అదొక నూతనకవితోద్యమంగా భావించడానికి బలమైన సబబులేదు. వచనగేయంకన్నా వారికవిత ఏవిధంగా భిన్నమైనదో తెలియడంలేదు. కవితలో ఎవరికి వారు ప్రత్యేకతను చూపుకోవడం అవసరమే. కాని అది "ఐసోలేషన్"కు మరోమాటలో చెప్పాలంటే "ముట్టుకొంటే మైలపడిపోతామనే మడికట్టే ఛాందస" ధోరణికి దారితీయరాదు.

దిగంబరకవుల తొలిసంకలనం వెలువడినప్పుడు దానికొత్తదనం పలువురిని ఆకర్షించి ప్రశంసలందుకొన్నవి. అయితే వారిలో తిరుగుబాటుధోరణి ఉన్నా దానికి లక్ష్యంలేదన్న విమర్శ ముఖ్యమైనది. ఆ పిమ్మట వెలువడిన రెండుసంపుటాలలో ఆ లోపం కొంతవరకు తొలగినా, లక్ష్యాలు, వాటిసాధనా మార్గాల విషయంలో విస్పష్టత రావలసినంతగా రాలేదు. ఈ విషయంలో మూడవసంపుటం మొదటి రెండింటికన్నా మెరుగు.

ఒక బృందంగా కృషి చేస్తున్నప్పుడు వారివారిసృష్టిలో వైవిధ్యం ఉండడం సహజమే అయినా, వైరుధ్యాలకు తావుండరాదు. విప్లవకాంక్షను కొలతబద్దగా తీసుకొంటే దిగంబర కవుల వైరుధ్యాలు ప్రబలంగా కనిపిస్తాయి. పాతవ్యవస్థను నాశనంచేసి నవసమాజావిష్కరణకు సాయుధకృషి జరుపుతున్న శక్తులపట్ల తమవైఖరి నిర్ద్వంద్వంగా ప్రకటించడంద్వారా వారుతమపై అపోహలకు తావులేకుండా చేయవచ్చు.

## సాయుధ కవిత్వానికి పిలుపు

రాజకీయ చైతన్యాల నూతనస్థాయినందుకొని పోరాటశక్తులు క్రియాశీలకంగా పరిణమించిన తరుణంలో ప్రబోధ కవిత్వం మరోఅడుగు ముందుకువేసి "సాయుధ కవిత్వం" కావలసివచ్చినది. పాతవ్యవస్థను విమర్శించడం, ఖండించడం, మార్పుకాంక్షించడంతో సరిపోవు. కవిత్వ కావ్యగానాలు, కవిసమ్మేళనాల వేదికలనువదలి పోరాటశ్రేణులలో యోధులసరసన నిల్చి ఉత్తేజపరుస్తూ వారిచేతుల్లోని ఆయుధాల్లో ఒకటిగా నిలవవలసి వచ్చింది. ఆలాంటి సాయుధ కవితోద్యమానికి "తిరగబడు" సంకలనం తొలిపిలుపు.

వరవరరావు, లోచన్, అశోక్, సంజీవరావు, సుధాకర్, యాదగిరిరావు, కిషన్, సుదర్శన్, ఎక్స్‌రే, ఐ-అనే "పదిమందీ" కలసి ఈ దేశంలో విప్లవం రావాలని నిజాయితీగా భావిస్తున్న, వెన్నెముకా ముందుచూపూగల యువకులందరికీ "తిరగబడుదాం" అని పిలుపు ఇచ్చారు.

తిరగబడమని వారెందుకు చెబుతున్నదీ వారిమాటల్లోనే చెప్పాలంటే "విషం కలిపిన పాయసం మన స్వరాజ్యం. డబ్బున్న భడవా పోషించే ఉంపుడు కత్తె మన ప్రజాస్వామ్యం....శాంతియుత పోరాటం అసంభవం....ఇది ప్రజాస్వామ్యంకాదు....మన విద్యావిధానం వొకపెద్ద కుట్ర- తిరుగుబాటు తత్త్వాన్ని

రాజీధోరణిలోకి మార్చడానికీ... తొలిగిపోని ఆర్థిక అసమానతలు.. మూలం పెట్టుబడిదారీ విధానంలోనే ఉన్నవి....ఈ నిజాన్ని పీడితతాడితులకు తెలిపి వారిని గాఢనిద్రనుంచి మేల్కొల్పి చైతన్యవంతులుగా చేయడం అభ్యుదయవాదుల కర్తవ్యం."

మరి తిరుగబడి నందువల్ల ఉత్పన్నమయ్యే సమస్యలు తెలియని ఆవేశం కాదుగనుక వారిలా అంటున్నారు. "ఈవ్యవస్థకు శస్త్రచికిత్సచేసి కొత్తవ్యవస్థను నిర్మించడానికి త్యాగాలు, బలిదానాలు తప్పవు. అయినా "విప్లవం వర్ధిల్లా"లని పోరాడే యోధుని చావు ఓటమికాదు." అందుచేత "అరణ్యాల్లో, కొండ కోనల్లో, చెట్లలో, పొదల్లో కార్చిచ్చులా రాజుకొంటున్న ఈ జ్వాలల్ని పంచడానికే మా యీ తిరుగుబాటు హస్తాలను అందిస్తున్నాము" అని వారు చెబుతున్నారు.

సమాజానికి అవసరమైన "శస్త్రచికిత్స" అంపే ఉన్నభయం, "ఆపరేషన్" చూపుతున్నది. నీ "చెయ్యి" అడ్డమైనకాళ్ళు పట్టుకొని నోట్లో గడ్డి పెట్టుకోవడానికేనా" లేక నీ చేతుల్లో చేవఉంటే "ఈ అసహాయ ఆశలను పిండుకొని బలసిన కండలను కాల్చి భవిష్యత్తు దీపాన్ని వెలిగించు" అంటూ సవాలుచేస్తున్నాడు కవి. "కేసరీ....నీ కంఠీరవత్వాన్ని నిరూపించు"అని వెన్నుతట్టి పిలుస్తున్నాడు.

ఇకవీరుడెవరు? "సంకెళ్ళుతెంచుకొన్న కాలుకు ముందుచూపు చేతిలో కత్తి ఆలోచనలో ఆదర్శం ఆమోదించిన హింస"అని సమాధానమిస్తున్నాడు.

"ఇరవై ఏళ్ళ అవమానంతో కాలికాలి ప్రేలుటకు సిద్ధంగా ఉన్నాను. ట్రిగర్‌మీద వేళ్ళతోరా....యీ నియోప్యూడలిజాన్ని ఎక్కడికక్కడ కూల్చమంటున్నాను ముక్కలుచెక్కలుగా చీల్చమంటున్నాను....మానవత్వం పలికే నీ రక్తంతో కొత్త చరిత్ర రాయాలి... బయొనెట్ పాయింట్‌మీద మాట్లాడమంటున్నా ట్రిగర్‌మీదవేళ్ళతో రమ్మంటున్నా" అంటు ఆవాహన చేస్తాడు మరోచోట.

ఆకలిఅవుతున్నది "అడ్డొచ్చిన వన్నీ సర్వనాశనంచేస్తా"నని హెచ్చరిక చేస్తున్నాడు.

"నేను చిందించినరక్తం ఈ సంధ్య నేటిస్వప్నం రేపటి ఉషస్సు" అని విజయగీతం ఆలాపిస్తున్నాడు.

"కాగడావై కదులు ఆయుధంపట్టు" అని ఆహ్వానిస్తున్నాడు సాయుధకవి.

ఇంకా సంధిగ్ధస్థితిలో ఎవరైనా ఉన్నారేమోఅని "యోధుడా సమానత్వం సాధించు అందుకే విప్లవించు" అని పురికొల్పుతున్నాడు.

మరి "ఈ పోరాటంలో రాజీ అసంభవం" అని ఉద్ఘాటిస్తున్నాడు.

అప్పటికి ఇంకా జడప్రాయంగాఉన్న వారి నుద్దేశించి "లేవరేం మరణమో విప్లవసమాజావతరణమో తేల్చుకో" అని పిలుపు ఇస్తున్నాడు.

మున్ముందు మహాపోరాటంలో ట్రెంచీలలో, కదనుతొక్కుతూ సాగి పోయే యోధుల వరుసల్లోనుంచి వినవచ్చే సాయుధ కవితాగానానికి "తిరుగ బడు" ఈ విధంగా నాందిపలికింది. జాతిజనులు పాడుకోవడానికి ఉద్దేశించిన కవిత లయబద్ధంగా సామూహిక ఆలాపనకు అదునుగా ఉండాలి. సాయుధ కవిత్వం సఫలం కావాలంటే ఆ విధమైన రూపు సంతరించుకోవలసి ఉంటుంది.

నేడు పోరాటం జరుగుతున్న ప్రాంతాల్లో ప్రచారంలో ఉన్న ఒక గేయాన్ని ఇక్కడ ఉదహరించవచ్చు :

"కండబిగువు కలిగినట్టి
కొండజాతివీరుడా
ఉప్పెనవలె ఒక్కసారి
లేచి ముందు కురకరా"

ఆ తరహాదే మరో ఉదాహరణ :—

"వేగ రావోయి శ్రామికా
వేగ రావోయి గిరిజనా

ఆకసమున ఎగిరెడి
ఎర్రని జండాకు జై !
గిరిజన జండాకు జై !"

ఈ దృష్టితో చూస్తే "తిరుగబడు కవులు" అంతకన్నా మించి "దిగంబర కవులు" ఎంతగా పరిణతి చెందవలసి ఉన్నదో అవగతమౌతుంది.

"తిరుగబడు" సంకలనంలో పోరాటానికి పిలుపే కాక సమకాలీన సమాజంపై విమర్శలు, ప్రజలకు మందలింపులు, హితబోధల రూపంలో రాజకీయ ప్రచారం కూడా లేకపోలేదు. ఏ పోరాటానికైనా రాజకీయ ప్రచారం ముందుగా జరగడం అవసరమని వారు గుర్తించినట్టు విదితమౌతుంది.

"సహనం గాడిద లక్షణం" అంటాడు.

ప్రస్తుత దోపిడీ దారీ వ్యవస్థలో "దేశాభిమానం దేశమాత, దేశీయతా వట్టి బూటకం" అంటూ సైద్ధాంతిక చర్చకు దిగుతాడు.

నేటి విద్యాలయాలు "సాధు సర్వ విశ్వాలయాలు అలేమొగ్గలు ఇక్కడ సమాధి చేయబడుతాయి" అని నిశితంగా విమర్శిస్తాడు.

ఈ బ్రతుకు "కుక్క బతుకు" కన్నా భిన్నం కాదని చూపుతున్నాడు.

ఈ సామాజిక ధ్వజస్తంభం నేలకొరుగుతున్నదని చెబుతూ ఆశకల్పిస్తాడు.

యాతనామయ నిశిలో "ఉదయం కోసం" పడే ఆరాటం ఉన్నది.

సాహిత్యంపై సమాజానికి, సమాజంపై సాహిత్యానికి ప్రభావం పరస్పరంగా ప్రసారితమౌతూనే ఉంటుంది.

అయితే సామాజిక పరిణామాలకు స్పందించి ప్రజలను ఉత్తేజ పరచడానికి పూనుకొన్న ఈ నూతన కవితోద్యమాలు "సాహిత్యంతో అతివాద బాలారిష్టంగా" కొందరికి కనిపించి గాభరా పుట్టిస్తున్నాయంటే అవి కొంత వరకైనా సఫలమైనవనే భావించవలసి ఉన్నది. వారి రాజకీయి యజమానులు పోరాటాలను కాల రాయాలని చేస్తున్న యత్నాలవలెనే ఈ సాహిత్య పీఠాధిపతుల దాడులు కూడా పరాజితం కావడం తథ్యం. ప్రజలు, ప్రజా కవులు మాత్రమే అజేయులు.

# విమర్శ కళా? శాస్త్రమా?

ఎస్. జవాద్ హుసేన్

కళ, విమర్శ, శాస్త్రం, తత్త్వశాస్త్రం మొదలయినవి వ్యక్తి అభిరుచులను బట్టి నిర్దిష్ట సామాజిక చారిత్రిక స్థాయిని బట్టి నిర్వచింపబడతాయి. ఆధునిక యుగంలో సాహిత్యం అని పిలువబడుతున్నదే ఆదిమకాలంలో సాహిత్యం, మతం, నీతి అని పరిగణింపబడేది. "It (poetry) is then coincident with literature as a whole, the common vehicle for history, religion, magic and even law." ప్రాక్తనసమాజంలో సంస్కృతిలో కవిత్వం స్వతంత్రమైనది కాదు.

చరిత్ర, మతం, యింద్రజాలం, న్యాయసూత్రాలు యివన్నీ కలిసే వుండేవి. క్రమక్రమంగా మానవ సంస్కృతి వివిధ పరిణామదశల్లో జ్ఞానం భిన్న శాఖలుగా విభజింపబడి అభ్యుదయం అందింది. ఏనాడు సాహిత్యం ఆరంభ మయిందో ఆనాడే సాహిత్య విమర్శ కూడా ఆరంభమయింది. ఇలియట్ అభిప్రాయంలో విమర్శ సాహిత్యంకంటే ప్రాచీనం.

ఆధునిక మేధావులు విమర్శ కళా శాస్త్రమా అనే విషయాన్ని బహు ముఖాలుగా చర్చించారు. ఈ చర్చకు ఆదిలోనే హంసపాదున్నది. విమర్శ కళా శాస్త్రమా తత్త్వశాస్త్రమా అనే ఆలోచించాలి.

విమర్శ కళకు సంబంధించింది. కళానుభూతిని విశ్లేషించేది. "criticism is the study of the art by which the poet presents the emotional aspects of the things so as to communicate his own feelings to others". కవి వర్ణించే వివిధ వస్తువుల్లోని రసాంశను తనవైన సంవేదనలను యితరులకు వ్యక్తీకరించే మార్గాలను సిద్ధాంతీకరించుటే విమర్శ. కనుక విమర్శ కునికి లక్ష్యం కావ్యం, కావ్యార్థవివరణ. కావ్యం విభిన్నమయినట్లే కావ్య విమర్శ కూడా భిన్నమే. ఒక కావ్యంపై భిన్నాభిప్రాయాలకు అవకాశమున్నది. కాబట్టి విమర్శ కళ అని కొందరి సిద్ధాంతం. అభిప్రాయాల్లో వైవిధ్యముండ వచ్చును. కాని వొక అభిప్రాయాన్ని మరొక అభిప్రాయం ఖండించడంలేదు.

ఏ అభిప్రాయంలోనైనా కాలాంతరాల్లో నిలిచే సత్యాంశ కొంత వుంటుంది. కనుక అభిప్రాయ వైవిధ్యాన్ని బట్టి విమర్శను కళ అని నిర్ణయించడానికి వీలులేదు.

కళకు ఆత్మ అయిన రసానందజనకత్వం విమర్శలో లేదు. కళకు హృదయం పునాదికాగా విమర్శకు విశ్లేషణాత్మకమైన బుద్ధి ఆధారం. కళయందు బుద్ధి ప్రమేయమున్నా హృదయ సంబంధి కాకపోతే శైలీ బద్ధం కాకపోతే అది కళేతరమవుతుంది. శబ్దక్రీడ, అర్థశిల్పం, ప్రతిపాదనా మార్గం కళ. విమర్శ వలన అనుభూతి కలిగినా అది సార్వజనీనమనడానికి అవకాశం లేదు. కళా స్వాదన సమయంలో అట్టి ఆస్వాదం సార్వజనీనం కనుక విమర్శ వస్తుదృష్టితో కాని శిల్పసౌందర్యములదృష్టితో కాని 'కళ' అనుకోవడానికి వీలులేదు.

ప్రపంచంలో చాలా మంది మేధావులు విమర్శను శాస్త్రంగా పరిగణించారు. ప్రాచీన భారతీయులు అలంకార శాస్త్ర మని, సాహిత్యశాస్త్రమని, కావ్య మీమాంస అని విమర్శను శాస్త్రంగానే పరిగణించారు.

ఆధునికులు శాస్త్రం అనే పదాన్ని అనేక అర్థాల్లో వ్యవహరిస్తున్నారు. స్థూలంగా వస్తు తత్త్వాన్ని ప్రయోగాత్మకంగా నిరూపించేది శాస్త్రం అని ఆధునికుల అభిప్రాయం. శాస్త్రదృష్టితో చేయబడిన సిద్ధాంతం పూర్వపక్షంలేని సత్యమని కొందరి నమ్మకం. శాస్త్రమనేది ప్రయోగశాలలో పుట్టలేదు. అనంత విశ్వమే శాస్త్రానికి ప్రయోగశాల. భౌతిక శాస్త్రానికి పరిమితమై శాస్త్రనిర్వచనం చేయడం సంకుచితం. చివరకు భౌతిక శాస్త్రంలోకూడా యే సిద్ధాంతమూ మార్పు లేనిదీ అభివృద్ధి పొందనిదీకాదు. శాస్త్రానికి సత్యసమ్మతమైన నిర్వచనమిది. "Ordered knowledge of the nature's phenomena and of the relation between them." ప్రపంచ పదార్థాలకుగల పరస్పర సంబంధాన్ని చెప్పే తత్వబద్ధమైన జ్ఞానమే శాస్త్రం. ప్రకృతి గతవస్తు స్వరూప నిర్ణయమే శాస్త్రం అనే పరిధిలో విమర్శ శాస్త్రంకాదు. కళ సజీవమైన చైతన్యవంతమైన రూపం. సమాజ సంబంధంగల విశ్వంలో వొక అంశ అయిన మానవుడు తన ఆంతర్యం నుంచి నిర్మించే చైతన్యరూపం కళ. అది భూమివంటి, పువ్వువంటి ప్రత్యేక పదార్థం కాదు. కనుక పదార్థ శాస్త్ర సత్యం కావ్య స్వరూప నిరూపణ చేయజాలదు. కళా ఖండంపై చివరిమాట వుండదు. కళనుగురించి ఆలోచన ఆగదు. అన్వేషణ ముగియదు. "Poetry is mental, spiritual not a physical thing."

కవిత్వం మానసికమైంది; తాత్త్వికమైంది. భౌతిక పదార్థం కాదు. కనుక సంకుచిత పరిధిలో విమర్శ శాస్త్రం కాదు.

"ప్రపంచ పదార్థాలకుగల పరస్పర సంబంధాన్ని గూర్చి తర్కబద్ధమైన జ్ఞానమే శాస్త్రం." అనే నిర్వచనం శాస్త్రానికి, తత్వశాస్త్రానికి సంబంధించింది. "All criticism is no doubt influenced by the critic's views on matters other than literature." సాహిత్యవిమర్శలో సాహిత్యానికి సంబంధంలేని విషయాలపై విమర్శకునికి వున్న అభిప్రాయాల ప్రభావం వుంటుంది.

ప్రకృతి తత్త్వాన్ని, మనిషికి పరిసరాలకు గల సంబంధాన్ని, జీవిత స్వభావాన్ని విశ్లేషణాత్మకంగా అన్వేషించి సిద్ధాంతాలు చేసేది తత్త్వశాస్త్రం. ఈ తత్త్వశాస్త్రంలో జీవితానికి సంబంధించిన అన్ని విషయాలు వొకానొక దృక్పథానికి కట్టుబడుతాయి. విమర్శకునికున్న యీ దృక్పథమే సాహిత్య విమర్శకు మూలమవుతున్నది. "In art criticism values are ranged and integrated in a perspective or world view which is a more general view of art from out side." సాహిత్య విమర్శలో ప్రమాణాలన్నీ వొక ప్రపంచ దృక్పథంగా ఆకృతినిపొంది కళేతర ప్రపంచంనుంచి ఆవిర్భవించును. ఈ జీవన దృక్పథమే, యీ తాత్త్విక దృక్కోణమే సర్వ సాహిత్య విమర్శకు మూలం. విమర్శకుడు యే తాత్త్వికమతశాఖకు సంబంధించునో అదే విమర్శకుని వ్యాపారానికి మూలమవుతుంది.

ప్రాచీన గ్రీకు విమర్శంతా భావ ప్రక్షాళనమనే అపరిణత ప్రజాస్వామ్య దృక్పథానికి దగ్గర. అరిస్టాటిల్ విమర్శకు గణితశాస్త్రం ప్రమాణం కాగా ప్లేటో విమర్శకు పదార్థశాస్త్రం అయింది. ఆనందవర్ధనుని ధ్వన్యాలోకం అద్వైతంపై ఆధారపడ్డది.

విమర్శ రెండు విధాలుగా కన్పిస్తుంది. 1) కవిత్వతత్త్వ సంబంధి. 2) నిర్దిష్టగ్రంథ సంబంధి. ఈ రెండు విధాల విమర్శలకుకూడా వూపిరిలూదేవి తాత్త్విక సూత్రాలే.

ఒక గ్రంథంలో వొక గ్రంథంయొక్క సాహిత్య విలువలు నిర్ణయించేప్పుడు భౌతిక వాద తత్త్వవేత్త స్వీయ సిద్ధాంతాన్నే దర్శిస్తాడు. అత్యాధునికకవి ఇలియట్ విమర్శలకు అతని నైతిక దృక్పథమేమూలం. కనుక సాహిత్య విమర్శ అనేది కళకాదు, శాస్త్రమూ కాదు, అది తత్త్వశాస్త్రమే.

# ఆహ్వానిస్తోన్నాను విప్లవాన్ని

సి. విజయలక్ష్మి

జాతి శకటాన్ని లాగుతోన్న దానాలేని గుర్రాలూ
దేశం అరకను దున్నుతోన్న మేతలేని ఎద్దులూ
నిరాశలో కూరుక పోయిన సామాన్య ప్రజలూ
ఎదుగూ బొదుగూ లేని జీతాలూ జీవితాలూ.

కొండవిరిగి మీదబడ్డా కుండ పెంకుల్లా అడ్డపీతలా
బద్ధకం జలాల్లో అభ్యంగన స్నానమాచరిస్తోన్న మేధావులూ
ఎండిన తడికల్లాంటి మిడిల్ క్లాస్ గడియారం పెండ్యులాలూ
తిండికి మాడి చస్తోన్నా గోడౌన్లలోకి వురుకుతోన్న తండులాలూ.

కాషాయం బట్టలు గట్టుకొన్న సాములోర్లకి
సాష్టాంగ దండ ప్రణామం గావిస్తోన్న రాజ్యాధినేతలూ
కట్టుకథలకి ప్రాణం పోస్తోన్న పుట్టకొక్కు పత్రికలూ.

జనాన్ని పిట్టల్లా పేల్చేస్తోన్న పోలీసువాళ్ళూ
రక్త సిక్తమైన ఉత్తర్ పారాలూ
కొత్త నెత్తురు తాగుతోన్న జోనంగి కుక్కలూ
నరకాసురులు నిత్యం జరుపుతోన్న కిరాతకాలూ.

ఏదుపంది ముళ్ళలా నిక్కబొడుచుకొన్న
ఇరవై యేళ్ళ ఎద్దుమార్కు నిరంకుశత్వం
మొగుణ్ణిగొట్టి మొగసాల కెక్కిన రంకులాడిలా
నడి బజార్లో చెడుగుడాడుతోంది!

గాండ్రిస్తోన్న పెద్దపులి నేటి దేశం
ఘుర్ఘురిస్తోన్న ఆది వరాహం నేటి దేశం
బుసలుగొడుతోన్న ఆడ నాగు నేటి దేశం
మంటలు గక్కుతోన్న మధ్యందిన మార్తాండ బింబం నేటి దేశం.

బద్దలు గాబోతోన్న అగ్నిపర్వతంపై పానకం కుండలు వర్షించలేను
పగిలి పోయిన దోపిడీ విషభాండాన్ని అతికించడం హర్షించలేను
జనతా త్రినేత్రునిపై మన్మథ శరాల్ని సంధించలేను
కోటాను కోట్ల గుండెల ఆగ్రహాన్ని శాంతి వచనాలతో బంధించలేను.

నిరంతరం జాజ్వలిస్తోన్న మానవాగ్ని గుండంలో
నిత్యం చైతన్య సమిధుల్ని వేస్తోన్నాను
ఆకలేసి కేకలేస్తోన్న జనం కోసం
విప్లవాన్ని ఆహ్వానిస్తోన్నాను.

ఆకలి మంటల్తో అలమటిస్తోన్న వాడికి
అహింసను బోధించేవాడు లుచ్ఛా
నిరాశలో కూరుకపోయిన వాడి ముందు వేదాంతాన్ని [illegible]ంచేవాడు
పాలక వర్గాల గంజి మెతుకులు తాగే పాచ్ఛా.

ఈ పాలక వర్గం గోడమీది పిల్లి
ఈ పాలక వర్గం రంగులు మార్చే ఊసరవెల్లి
ఇది ఎన్నికలప్పుడు ఎన్ని రంగులైనా వేస్తుంది
ఆ పిదప ఎముకల్ని విరగ్గొట్టి పిండి జేస్తుంది.

ఈ పాలక వర్గం జాతి ద్రోహుల పంచకూళ కషాయం
ఈ పాలక వర్గం గర్భ విచ్ఛిత్తి రాయుళ్ళ ప్రచార కేంద్రం
ఈ పాలక వర్గం అన్నం అడిగిన వాళ్ళ నోళ్ళకి
సున్నం రాసే ఆయారాం గయారాంల మఠం.

రక్తం చిందకండా జరగదు నూత్న శిశోదయం
చీకటి గర్భాన్ని చీల్చినప్పుడే వేకువ రావడం ఖాయం
దోపిడీ వర్గాల్ని నాశనం జేసినప్పుడే
జరుగుతుంది జాతికి సమగ్ర న్యాయం.

పోరాటమే నేటి జీవిత సమస్యల పరిష్కారం
పోరాటమే నేటి దేశానికి నిత్యావసరం
పోరాటం లేని కుక్క బతుకుల జీవితం
పడుతుంది ఎంగిలి మెతుకుల కారాటం.

మండుతోన్న వర్గ చైతన్యమే మీ చేతిలోని ఆయుధం
అభేద్యమైన మీ ఐక్యమత్యమే జాతికి గాండీవం
అంచేతనే రండి సమస్త మానవులారా రాక్షస సంహారానికి
పదండి దిక్కులేనివారలారా పందుల్ని వేటాడేందుకి.



# పిలుపు

ఎ. బి కె. ప్రసాద్ & రవీంద్రబాబు

## పాత్రలు

1. బిచ్చగాడు (వయస్సు 35): మొలకి చిరిగిన పంచి తప్పించి, శరీరం అంతా నగ్నంగా వుంటుంది. ఎండిపోయిన డొక్కలు, మాసిన గెడ్డం, గుంట కళ్ళు, ఊపిరిలేని నడక, ఏదో ఆవేదన. పిలుస్తున్న ఆకలి, చేతిలో చంటిపాప.

2. రాజకీయ నాయకుడు (వయస్సు 40): ఖద్దరు పంచి, ఖద్దరు లాల్చీ (అవసరమనుకుంటే గాంధీ టోపీ), హాఫ్ బూటు, ఠీవైన నడక.

3. వ్యాపారస్థుడు (వయస్సు 40): పెద్ద బొజ్జ, పంచి, సిల్కులాల్చీ, మనిషి నలుపు రంగు, నొసట వెంకటేశ్వర నామాలు, చంకలో క్యాష్ బ్యాగ్, నెమ్మదైన నడక.

4. కవి (వయస్సు 35): పైజామా, సిల్కులాల్చీ, గోల్డు ఫ్రేమ్ కళ్ళజోడు, కాళ్ళకు అందమైన చెప్పులు, చేతిలో సిగరెట్ టిన్ను, నోట్లో సిగరెట్టు.

5. పత్రికా ప్రతినిధి (వయస్సు 30): ప్యాంటు, బుష్షర్టు, కళ్ళకు పెద్ద ఫ్రేమ్ కళ్ళజోడు, రిస్టువాచీ, కాళ్ళకు చెప్పులు, చేతిలో కాయితాలు-పెన్ను, మరో చేతిలో సిగరెట్టు,

6. యువతీ యువకుల జంట (వయస్సు 18-20): (ఎ) యువకుడు: టైట్ ప్యాంటు, పెద్ద గళ్ళు లేదా బొమ్మల షర్టుతో ఇన్‌షర్టు, పాయింటెడ్ బూట్లు, రోమన్ హెయిర్‌కట్, నల్లకళ్ళద్దాలు.

(బి) యువతి : జీన్ ప్యాంట్, స్లీవ్‌లెస్‌స్కర్ట్, పెదాలకు లిప్‌స్టిక్, హైహీల్స్, చేతిలో వ్యానిటీ బ్యాగ్, నల్ల కళ్ళద్దాలు.

7. పోలీస్ (వయస్సు 45) : పోలీస్ దుస్తులు, చేతిలో లాఠీ కర్ర.

8. భారతి (వయస్సు 20) : నల్లచీర, చీరమీద తెల్ల గుడ్డతో అతుకులు, అక్కడక్కడ చిరిగివున్న నల్ల జాకెట్, విరబోసుకున్న కురులు, నొసట తిలకం [తిలకం ఉంచినా ఉంచొచ్చు, లేకపోయినా లేకపోవచ్చు] కాళ్ళకూ చేతులకు కలిపి సంకెళ్లు.

## రంగాలంకరణ

[వీధి దృశ్యం. కుడివైపున మునిసిపాలిటీ మురికి తొట్టె. గోడకు దగ్గరగా. దాన్నిండా ఎంగిలి విస్తళ్ళు. గోడ వెనక భాగాన ఏదో శుభ కార్యం జరుగుతున్నట్లుగా అలంకరణ. రంగస్థలానికి కుడి, ఎడమ ప్రవేశ నిష్క్రమణ మార్గాలు;

గోడమీద ఈ పోస్టర్లు అంటించి వుంటాయి : ఇద్దరు లేక ముగ్గురు—డాక్టరును సంప్రతించండి; నేడే చూడండి! అర్థరాత్రి నగ్న నృత్యం!! నేడే విడుదల! జేమ్స్ బాండ్ 007 విత్ సెక్స్ (007 With Sex);

గోడకు ఎడమ వైపున పైభాగంలో : పీడిత ప్రజలారా ఐక్యం కండి! క్రింది భాగాన ఎడమ వైపుకు బాణం (←) గుర్తుతో "సుఖ వ్యాధులకు డాక్టర్ ఆరోగ్యం గారిని సంప్రతించండి", అని వుంటుంది.

తెర తెరవగానే ఓ నిమిషం గడచిన తరువాత గోడ వెనకనుంచి బంతి భోజనాలకు సంబంధించిన అరుపులు వినిపిస్తుంటాయి. ఇంతలో ఎడమ వైపునుంచి మునిసిపాలిటీ మురికి తొట్టె దగ్గరకు ఓ బిచ్చగాడు, ఓ పసిబిడ్డను ఒడిలో పెట్టుకుని చాలా నీరసంగా చేరతాడు. ఆ పసిబిడ్డను నేలమీద పడుకోబెట్టి, వెనకనుంచి పడుతున్న విస్తళ్ళలోని మెతుకుల్ని, పదార్థాల్ని ఏరుకు తింటాడు.]

( నేపథ్యంలో )

చూడు చూడు నీడలు
నీడలు పొగమేడలు
పేదవాళ్ళ వాడలు
బక్క చిక్కి బిక్క చచ్చి
పడిన బతుకు గోడలు
పాడు పడ్డ వాడలు

[పాట ముగుస్తుండగా రాజకీయనాయకుని ప్రవేశం. ఎడమ నుంచి కుడి వైపుకు వెళ్తూంటాడు. ఇంతలో బిచ్చగాడు ఆత్రంగా దేకుక్కుంటూ అతని దగ్గరికి సమీపించి, చేయి చాపుతాడు.]

రాజకీయ నాయకుడు : (చాల ఠీవిగా తలూపుతూ] ఏమిట్రా ?

బిచ్చగాడు : (ఎంతో దీనంగా) బాబ్బాబు, ఓ పది పైస లిప్పించండి. చంటి బిడ్డకు ఓ గుక్కెడు పాలు పట్టుకోవాలి బాబూ.

రా. నా : (విసుగుతో విసురుగా) పోరా, దరిద్రపు వెధవా !

బి : (రా. నా. కాళ్ళపై చేయివేసి) మూడు రోజులైనా పసిబిడ్డకు గుటక దిగలేదు............

రా. నా : ఏరా ! గుటక దిగకపోతే గుటుక్కుమంటుంది, అంతే గదరా ! (లి ప్తకాలం ఆగి) ఓరి వెధవా! పుట్టేది గిట్టడానికేరా! పోయే ప్రాణాన్ని పట్టుకుని వేలాడ్డం ఎందుకు ?

బి : కాదనకండి బాబూ. మీరెవరో మహానుభావుల్లా వున్నారు. కనికరించండి.

రా. నా : ('మహానుభావుడని' చెవిని పడేసరికి, మరింతఠీవిగా) ఏ వూర్రా, నీది ? నేనెవర్నో కూడా తెలీదానీకు ? (చూపుడువ్రేలుతో చుట్టూ ఒక త్రిప్పుత్రిప్పుతూ). ఈ చుట్టుప్రక్కల రాజకీయాలన్నీ మనచేతులు మీదుగానే నడుస్తున్నాయి.

బి (నిట్టూర్పు విడిచి) నాలాంటి జీవులకు ఒకూరేమిటి, ఒక వాడేమిటి ?! దేశమంతామాదే. (కొన్ని క్షణాలు రా. నా. ముఖంలోకి చూచి).... బాబ్బాబు, మీ రాజకీయ జీవితం చల్లగా వుండాలి. నా బిడ్డ పాలకోసం పదిపైస లిప్పించండి....

[రాజకీయ నాయకుడు హేళనగా నవ్వి వెళ్ళిపోతాడు. వాడు వెళ్ళినవైపే వింతగాచూసి, వెర్రిగా నవ్వుతాడు బిచ్చగాడు. గుండెల్లోంచి వస్తున్న ఆవేదన అగ్నికణాలై, నోట్లోంచి మాటలుగా వెలువడుతాయి]
మాకేంతెలుసులే రాజకీయాలు; మా జీవితాల్తో సంబంధంలేని రాజకీయాలు పచ్చ మేడల్లోనూ పరుపుదిళ్ళల్లోనూ మురిగిపోతాయ్‌గామోసు !

[గోడ అవతలనుంచి విస్తళ్ళు పడ్డాయి. ఆత్రంగా వాటిదగ్గరకు జేరాడు బిచ్చగాడు].

(నేపథ్యంలో)

అంతేలే పేదల గుండెలు
అశ్రువులే నిండిన కుండలు
శ్మశానమున శశికాంతులలో
చలిబారిన వెలిరాబండలు.

[పాట అంతమవుతూండంగా వ్యాపారస్థుని రంగప్రవేశం. నెమ్మదిగా ఉండలా నడుచుకుంటూ వస్తాడు. చూపులు సూటిగా వుంటాయి. పరిస రాలతో తనకు సంబంధం లేనట్టుగా కుడివైపుకు వెళ్తూంటాడు. అతడ్ని చూడగానే దగ్గరికి వస్తాడు బిచ్చగాడు ]

బి : బాబయ్యా! పదిపైసలు దానం చెయ్యండి. మీ పిల్లలు చల్లగుంటారు.

వ్యాపారస్థుడు : (వెకిలిగా నవ్వుతాడు. ఆయాసంగా, దీర్ఘంగా మాట్లాడతాడు). ఊఁ.... ఆఁ.... పిల్లలు చల్లగుంటారా.... నా పిల్లలు.... ఒరేయ్, నాకు పిల్లలెక్కడున్నార్రా.... నాచల్లదనం కోసం పదిపైసలు నీకెందు కియ్యాలి....?

బి : కాదనకండి బాబయ్యా !

వ్యా : ఏడిశావ్.... దున్నపోతల్లే వున్నావ్, పనిచేసుకోలేవూ....?

బి : (ఓ చిన్న నవ్వునవ్వి, బాధతో) చేశాను బాబు.... చేశాను. బి. ఎ. చదివి గుమాస్తాచేశాను. నిజాయితీకీ, నిరుద్యోగానికీ దగ్గరసంబంధం వుంది. ఉద్యోగం ఊడింది ! బతుకు బజారు పాలైంది. కాళ్ళు అరి గేట్టు తిరిగాను. కండలు కరిగేట్టు పనిచేశాను. కొత్తగూడెం బొగ్గు గనుల్లో నా రక్తం నల్లబడింది. ఊపిరి తిత్తులు చచ్చాయి. నాతోపాటు

పనిచేస్తూ, మందూమాకూలేక క్షీణించిపోయిన నా భార్య ఆఖరిశ్వాస అక్కడే వదిలింది. (వ్రేలుతో పసిబిడ్డను చూపుతూ) ఈ బిడ్డనాకు మిగిలింది. అయినా ఈ బిడ్డకోసం రిక్షాలాగాను. ఆ....శక్తి ఉడిగి పోయింది. ఇప్పుడు ఆ కాస్త అభిమానాన్ని కూడా దేశానికి రుణంగా పెట్టి అడుక్కు తింటున్నా.... బాబయ్యా....బతుకంటే ఆశలేదు.... కాని ఈ బిడ్డకోసం బతకాలి. ఒక్క.... పది పైసలిప్పించండి బాబయ్యా.

[బిచ్చగాడు మోకాళ్ళమీద కూర్చుని, రెండు చేతులూ జోడించి, దోసిట్ళు పడతాడు. వ్యాపారస్థుడు ఓ విషపునవ్వునవ్వి, వెళ్తూవెళ్తూ తను కాలుస్తున్న చుట్టనుసిని వాడిదోసిట్లో రాల్చి మరీ వెళ్తాడు! ఆ నుసిలోని రహస్యాన్నేదో కనుక్కోవాలన్నట్లుగా చూస్తూంటాడు బిచ్చగాడు!]

( నేపథ్యంలో )

బలవంతులు దుర్బల జాతిని
బానిసలను కావించారు
నరహంతలు ధరాధిపతులై
చరిత్రమున ప్రసిద్ధికెక్కిరి.

[ఈ పాట పూర్తయే సమయానికి కవి రంగ ప్రవేశం చేస్తాడు. "సొంత లాభం కొంత మానుకు-పొరుగు వాడికి తోడుపడవోయ్" అనుకుంటూ వస్తూండగా, రోడ్డు మధ్యనున్న బిచ్చగాడ్ని చూచి, ఆగి, ఒక్కడుగు వెనక్కి వేస్తాడు. బిచ్చగాడు దీనంగా కవి వంక అలా చూస్తూంటాడు.]

కవి : ఒరేయ్! పక్కకు తప్పుకోరా.

బి : బాబూ, కనికరించండి.

కవి : కనికరించాలా ?.........నా పని కరిగించడమేగాని కనికరించడం కాదు!

బి : (నిదానంగా) ఏం కరిగిస్తారు బాబూ ?

కవి : ఏం కరిగిస్తామా ? మానవ హృదయాన్ని.

బి : అంటే.........కరిగించి కరిగించి మనిషిని హృదయం లేనాడిగా చేస్తారా ?

కవి : (అర్థం కానట్లు చూస్తూ) ఏవిట్రా, వాగుతున్నావ్ ?

బి : నా కర్థం కాలేదు బాబూ !

కవి : (గర్వంగా) నేను కవిన్రా !

బి : అంటే..........

కవి : కవిత్వం రాసేవాడ్నిరా.

బి : (ఆశ్చర్యంగా) ఎవర్ని గురించి రాస్తారు బాబూ ?

కవి : ప్రజల్ని గురించిరా !

బి : అట్టాగా బాబూ ! మా గురించి కూడా రాస్తారా బాబూ !

కవి : ఇక్కడ నీ—నా తారతమ్యాలు లేవు. మనది కర్మ భూమి. ధర్మాధర్మాలతో నిమిత్తం లేదు. ఉన్నవాళ్ళకీ, లేనివాళ్ళకీ మధ్య నా కవిత్వంలో తేడా పాడాలుండవు. నా మాటల్లో పాటలుంటాయి. ఆ పాటల్లో ఆటలుంటాయి. వాటికి కాసులు రాసుల్లా పడతాయి. యువలోకం రేచుల్లా చెవి కోసుకు వింటుంది.

బి : అంత బాగా రాస్తారా బాబూ ! (కడుపు నవరించుకుంటాడు)

కవి : నీ వెప్పుడూ వినేలేదా ? అయితే వినిపిస్తా విను—

"చాపైతే సరసరమంటది
పట్టైతే పరపరమంటది
మంచమైతే కిరకిరమంటది
మెత్తటి పరుపెయ్యవే సీతమ్మో సీతమ్మ"!

(ఈ పాటవిని బిచ్చగాడు గట్టిగా నవ్వుతాడు) ఇదీగాక, ఈ మధ్య కొత్త పుస్తకం కూడా రాశా. అదే సినిమాతార సిమ్లాయాత్ర!

బి : (హేళనగా నవ్వుతూ, లేనిబలాన్ని తెచ్చుకొని) చాలా బాగుంది బాబూ.... చాలా బాగుంది....నా ఆకలికంటే చాలాబాగుంది !

కవి : (చిరాగ్గా) నీ ఆకలితో పోలుస్తావేట్రా ?

బి : నిజమేలేబాబూ.... నా ఆకలికీ మీ కవిత్వానికీ పోలికెక్కడ ! ఏదోలే బాబూ ! పోలవడానికి నేనెంతటివాడ్ని?!.... ఒక పది పైసలిప్పించండి. బిడ్డకుపాలుపోయాలి.

కవి : (చిరాకునుంచితేరుకోకుండానే) పది పైసలా ? .... వచ్చేప్పుడు వేస్తా లేరా! (ఒకడుగు ముందుకువేస్తాడు) మునివ్రేళ్ళుగాలిలో తిప్పుతూ ఏదో

ఊహలో ఉంటాడు, సిగరెట్టు పొగపూదుతూ) వస్తారా! మళ్ళొచ్చి స్తారా. ప్రక్క పేటలో గురజాడ వర్ధంతి సభలు జరుగుతున్నాయి. అక్కడో ఉపన్యాసం యిచ్చొస్తా. ఆ మరచినా సినీతార సన్మానంకూడా ఉంది. మినిష్టర్లు—వెళ్ళొస్తా. (నిష్క్రమిస్తాడు).

[వెళ్తున్న కవివైపు వింతగా చూస్తాడు బిచ్చగాడు]

(నేపథ్యంలో)

మా మొగాలకీ కన్నీరు
మీ మొగాలకా పన్నీరు
మా ఆకటి భగభగ
మీ నోట్లోసిగార్స్ భుగభుగ

[ఈ పాట పూర్తయేసరికి పత్రికా ప్రతినిధి ప్రవేశం. కుడివైపున దూరంగా రిక్షాగంట వినిపిస్తుంది.]

పత్రికా ప్రతినిధి : ఒరేయ్! రిక్షా! ఆగాగు!

బి : (అతడివంకచూసి, చెయ్యిచాపి) బాబూ, దానం చెయ్యండి, ప్రాణం పోతోంది.

ప. ప్ర : (విసుగ్గా ఆగి) ఈ వార్త వేయడానికి టైమూలేదు. పత్రికలో చోటూలేదు!

బి :.... బాబ్బాబు!

ప. ప్ర : చెప్పేది నీక్కాదూ? అక్కడో ప్రముఖసినిమా తారకు సన్మానం జరుగుతోంది. విద్యామంత్రిగారు ఘనంగా అధ్యక్షత వహిస్తున్నారు. ఆహారమంత్రి స్వయంగా ప్రారంభోత్సవం చేస్తున్నార్రా! తొందరగా వెళ్ళిపోవాలి. మా పత్రికకు వార్తందించాలి. (ఆతృతతో కుడి-ఎడమ లకుచూచి) ఇక్కడెక్కడా టాక్సీలేదేఁ!

బి : బాబూ! బిడ్డకుప్రాణం పోతోంది.... ఆ బోసినోరు, నోరిప్పి అడగ లేదు. ఒక్క పదిపైసలిస్తే, పాలుపోసిప్రాణం నిలుపుతా. కాదనకండి.

ప. ప్ర : (చాలాకంగారుగా టైముచూసుకుంటూ) వెధవ సందులోకొచ్చి పడ్డామె! (వెళ్ళి పోతాడు.)

(బిచ్చగాడు చేతులునేలకాన్చి, తలవంచి, అలాగే కూర్చుండిపోతాడు).

(నేపథ్యంలో)

అట్టడుగునపడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగనిసత్యం !

[పాటపూర్తవుతుండగా యువతీయువకుల జంట రంగ ప్రవేశం. ఈ జంట ప్రవేశిస్తూనే గోడమీాద ఉన్న సినిమా పోస్టర్లను పరిశీలనగా చూస్తూ, ఆ తాదాత్మ్యతలో క్షణక్షణానికీ అవయవ విన్యాసం ప్రదర్శిస్తూ వుంటారు.]

యువకుడు : డియర్‌రోజా ! (తెలుగు సినిమా పోస్టర్‌వైపు వేలుపెట్టిచూపిస్తూ) ఈ పిక్చర్‌లో మాంచిథ్రిల్, డ్యాన్స్ అండ్ సస్పెన్స్ వుంది చూద్దాం ?

యువతి : (సొంపుగా) పో ! రాజా ! నీవన్నీ బూజుపట్టిన భావాలు. నాట్‌నాట్ సెవెన్ విత్ సెక్స్‌కు వెళ్దాం రాజా. దాంట్లో జేమ్స్‌బాండ్ వున్నాడు.

బి : బాబ్బాబూ ! (అంటూ చేయిచాపుతాడు).

యువకుడు : చూడురోజా ! హాలివుడ్ పిక్చర్లకంటే ఇప్పుడు తెలుగు పిక్చర్లే లక్షరెట్లు నయం. సరే టాక్సీవాడు ఎక్కడికి తీసుకుపోతే అక్కడికి పోదాం. లేక ఏథియేటర్ దగ్గరో ఆ థియేటర్ దగ్గర దిగిపోదాం. అవునా ? ఓకే. ఊఁ చూడూ మనం రోజూ వెళ్ళేబుక్ స్టాల్‌కి పోయి ఓ పుస్తకం తీసుకోవాలని చెప్పాను గుర్తుందా ?

యువతి : యస్, యస్, గుర్తుంది....ఏం పుస్తకం ?

యువకుడు : "పగటికలలు, పడక గదులు" !

యువతి : ఓహ్ ! డార్లింగ్ నేనెప్పుడో చదివేశా దాంట్లోఏముందేఁ?

బి : అమ్మా ! అమ్మా....

యువకుడు : మరేదైనా పుస్తకం చెప్పు రోజా !

యువతి : (ఓక్షణం పైకిచూచి) ఆఁ........"ఒంటి తీపరం—చెడిన కాపరం" అనే పుస్తకం చాలాబాగుంది. తీసుకుందాం రాజా ! నేనుమళ్ళీమళ్ళీ చదవాలి.

బి : బాబూ.... ప్రాణంపోతోంది. (యువతీ యువకుల జంట వాళ్ళగొడవ లోనే వుంటారు. బిచ్చగాడు దగ్గరగావచ్చి, పాదాల మీదచేయివేసి) బాబా ! ఓ పదిపైసలివ్వండి.

యువకుడు : (చిరాగ్గా) చిల్లర్లేదుపోరా !

బి : (నిరాశతో, హేళనగా) పోనీ....చెక్కులున్నాయాబాబూ ?!

యువతి : ఛీ ! డర్టీబెగ్గర్స్ ! వీళ్ళకి అంటురోగాలుంటాయి, పోదాంరా రాజా !

యువకుడు : పదరోజా! (ఒకరిచేతులు ఒకరు కలుపుకొని ఒయ్యారంగా వెళ్ళి పోతారు).

(నేపథ్యంలో)

చెడుదారుల పయనించే
యువకులు—
పరదారులుపట్టి,
చుట్టుచూపులేక—అట్టె
నట్టేటను మునుగునట్టి
నావికులు...

(బిచ్చగాడు వెళ్ళిపోతున్న వాళ్ళిద్దర్నీచూసి నీరసపడి, శిరస్సునేలకు ఆన్చి, అలారోడ్డుమీద పడిపోతాడు. పాటపూర్తయేసరికి, పోలీసు కుడివైపుగా ప్రవేశం. చంకలో లాఠీకర్రపెట్టుకుని, పోలీసు హడావుడిగా వెళ్తూంటే, కాళ్ళకు బిచ్చగాడు తగుల్తాడు).

పోలీస్ : (కోపంగా) ఎక్కడచూసినావీళ్ళే. చచ్చేదేదో రోడ్డుపక్కన చావ గూడదూ? (అంటూ పక్కకు ఈడుస్తాడు బిచ్చగాడ్ని. మరోపక్క ఉమ్మేసి ఎడమవైపుకి వెళ్తాడు).

( నేపథ్యంలో )

రేఖ చెదిరితే గొల్లుమని పోతారు.
రేఖ అవతలివాళ్ళంతా నేరగాళ్ళు
ఆ రేఖని రక్షించడానికే,
న్యాయస్థానాలు, రక్షకభటవర్గాలు,
చెరసాలలు, వురికొయ్యలు....

(పాటపూర్తవుతుండగా "భారతి" ప్రవేశం. మౌనంగా విషాదవదనంతో తలవంచుకుని స్టేజీమీదకొస్తుంది. కళ్ళవెంట అశ్రువులు జలజలా రాల్తూవుంటాయి. భారతి, కనిపించగానే బిచ్చగాడు ఆతృతతో దగ్గరకు వెళ్తాడు. భిక్షపెట్టమన్నట్టుగా రెండు చేతులూ చాపుతాడు. ఆమె ముఖంలోకి చూసి, కన్నీరు కనిపించగానే మెల్లగా చేతులు వెనక్కితీసు కుంటాడు).

బి : (దీనస్వరంతో) ఎవరమ్మా నీవు? నాకంటే దీనంగా వున్నావు, ఎవరమ్మా ?

భారతి : (అతికష్టంతో తలకొంచెం పైకెత్తి) నాపేరు భారతి నాయనా (ఆమె కొన్ని క్షణాలు ఆగి) ఎవర్నాయనానీవు, ఇంత ప్రేమగా పలకరిస్తు న్నావు ?

బి : ....హుఁ.... (ఓ చిరునవ్వునవ్వి) నేనా, అమ్మా ? ఆకలిని (ఓ క్షణం ఆగి) నా సంగతి వదలి అటుచూడమ్మా (బిడ్డవైపు వేలెట్టిచూపిస్తాడు). మూడురోజులనుంచి కడుపులో ఏమీలేదాబిడ్డకు. నిన్నేమయినా చేయి జాపి అడుగుదామను....

భారతి : (మధ్యలోనే వెంటనే అందుకొని) నన్నా ?! .... నాదగ్గరేముంది నాయనా ? నాకు ఇరవయ్యేండ్లే అయినా అప్పుడే నూరేండ్లు నిండిపోయి నట్లున్నాయి. నేనుమట్టుకి ఏమివ్వగలను ?

బి : (గాద్గదికస్వరంతో) కనీసం కన్నీటితో అయినా బిడ్డ కడుపునింపు కుందామంటే, అవికూడా నాలో ఇంకిపోయాయి.

భారతి : కాని....ఆ కన్నీళ్ళే నాలో పుష్కలంగా వున్నాయి. ఇంకా వుంటాయి కూడా. అందుకోగలవా నాయనా ?!

బి : (కొన్నిక్షణాలు ఆగి)....అందరూ ఆ కన్నీళ్ళందుకో గలిగితే పరిస్థితులు మరింతవేగంగా పరుగెడతాయమ్మా.

భారతి : నిజంగా నాయనా....నిజం. బుద్ధి, జ్ఞానం, నెత్తురూ నరనరాల్లో ప్రవహిస్తుండే ప్రతిభారతీయుడూ అందుకోవాలి నాయనా,.... అందు కోవాలి.

బి : నిజమమ్మా, నిజం. కలవారిని కాసులైనా కలపలేవు. కాని కష్టజీవుల్ని కన్నీరు కలిపి తీరుతుందమ్మా.

(కిందినుంచి పైవరకూ భారతిని అదోలరహగా చూసి) ఇవేమిటి తల్లీ నీకీసంకెళ్ళు, ఈ చినిగిపోయిన బట్టలూ.

భారతి : నేటి మన జాతీయచిహ్నాలు! (కొన్నిక్షణాలు బిచ్చగాడి ముఖంలోకి చూసి) ధర్మం నశించిన చక్రమూకాదు, మూగవోయిన మూడు సింహాలూ కావు నాయనా, మన జాతిచిహ్నాలు. (బద్దలవుతున్న బాధతో) అప్పుల పాలైన దేశమూ, కప్పులూడిన యిళ్ళూ, ఎండినడొక్కలూ, చితికిన బతుకులూ, చల్లారిన సంసారాలు, ఇవేమన జాతిచిహ్నాలు నాయనాఇవే. మన సంస్కృతి కుళ్ళి, జాతి నుదుట చీముతో తిలకం దిద్దుతోంది నాయనా.

బి : అవునుతల్లీ....నిజం చెప్పావు. నీ గుండెల్లో పగులుతున్న అగ్ని పర్వ తాల 'లావా' నీ కళ్ళల్లోంచి ప్రవహిస్తూ, అందులో ఏభైకోట్ల ప్రజల దీనస్థితి కనిపిస్తోందమ్మా.........ఎప్పుడమ్మా మంచి రోజు వచ్చేది.... ఎప్పుడమ్మా ? ?....

భారతి : వస్తుంది నాయనా....నీకోసం అందరూ, అందరికోసం నీవు నిలబడ్డ నాడే వస్తుంది. కొందరికేకాదు సుఖం, అందరికీ అందేరోజు, ఆనాడే, ఆనాడే....!

బి : (ఆతృతతో) ఆరోజు నిజంగానే ఎప్పుడొస్తుందమ్మా ?

భారతి : అమాయకుడా! ఎందుకురాదు ? పరిస్థితులు పక్కానికొచ్చి పగిలి పాఠాలు చెపుతున్నాయి. ఈ పాఠాలనే గుణపాఠాలుగా తీసుకొని మరు గున వున్న మానవశక్తి విజృంభిస్తే—దానవులెంతసేపు. ఈ సంకెళ్ళెంత సేపు. ఎన్నాళ్ళు ? (మెల్లగా వెళ్ళిపోతుంది. ఆమె వంక ఆశాజ్యోతిని చూసినట్లు చూస్తాడు బిచ్చగాడు).

( నేపథ్యంలో )

స్వతంత్ర భరతవర్ష వాస్తవ్యుడా మానవుడు
అర్థనగ్నంగా ఆకాశాన్నే కప్పుకుని
నిండని కడుపుతో మండుతూవున్న కళ్ళతో
ఎంతకాలం ఇంకెంతకాలం నిలబడతాడాప్రాణి ?

(భారతి వెళ్తున్నవైపె కొన్ని నిమిషాలు చూసి, తన బిడ్డదగ్గరికి చేరతాడా బిచ్చగాడు. ఆ బిడ్డకాస్తా చనిపోయి వుంటుంది ఆరని ఆవేదనతో కుళ్ళికుళ్ళి ఏడుస్తాడు. అప్పుడు నేపథ్యంలో).

మానవుడా నావాడా!
నావాడా! మానవుడా
నీగాథలు కనవోయి—ఈ
సహజీవుల బాధలు వినవోయి!!

— మా॥

సామాన్యుని క్షామం
కామందుని క్షేమంగా,
తరతరాల దోపిడిలో, నీ
తనువే రాపిడిగా—
కొండలన్ని పిండిగొట్టి
కండలు కరిగె-ఆ
బతుకుబాట గతుకులలో
రాబండలు పెరిగె!
కూల్చినారు నిరుపేదల వాడలు
అచ్చోటనె కూర్చినారు
శ్రీమంతుల మేడలు!
శ్రమజీవుల జంటల
గుండెలవడి మంటలు
సుడిగాలులు రేపిన
వడగాడ్పుల పంటలు!

—మా॥

జీవితమన్న
పదిమందిన నెత్తిట చేయెట్టి
తానొక్కడె సుఖియించుట కాదన్నా!
ఈ భువి
సంపదకంతకూ

అధినాథులు అందరు
కాదను ఆ భడవాలెందరులే ? !
ఈ
అంతరాల దొంతర్లు
అంతమయేదాక—నీ
జీవన సమరం సాగునులే నిత్యం
అదిజయమొందుట సత్యం !
అనునిత్యం మృత్యువునే
అనుభవించు సామాన్యుడు.
ఆ మిత్తవ ఎదురైతే
సాహసించు మాన్యుడులే !
వాడేలే రాబోయే
స్వర్ణయుగపు ధీరుడు
మహినిండిన రాకాసుల, రేచుల్లా
మర్దించగ లేచునోయి !
మత్తువిడిచి సత్తువతో
ముందడుగై సాగునోయి
ముందడుగై సాగవోయి !

(నెమ్మదిగా స్వరంతగ్గుతూ వుంటుంది పాటపూర్తవుతుంది. బిచ్చగాడిలో ఏదో చెప్పలేని ఆవేశం కలుగు తుంది. పెనుగులాడుతున్నాడు. ఉన్నశక్తిని కూడదీసుకుంటున్నాడు. ఆవేశంలో లేచి నిలబడ్డాడు)

....నేనూ ముందడుగువేస్తా. వేయకపోతే గత్యంతరంలేదు. రాబందులూ, కామందులూ రాక్షసం చెలాయిస్తున్న రాజ్యంలో, బతుకే భారమయిపోతున్న సమాజంలో, బతకడంకోసం వేయాలి అడుగు. ఈ క్షణంలో— అనుక్షణం ఆకలిచిచ్చుకూ, అప్పుల ఉచ్చుకూ ఆహుతవుతూ క్షణమో యుగంగా గడుస్తున్న ఈ క్షణంలోనే ముందుదారిచూడాలి.

ఈస్థితి, నాస్థితి, నాలాటి కోట్లాది దీనుల పరిస్థితి మారాలి, మార్చితీరాలి. ఆ శక్తి ఎక్కడోలేదు. నీలో, నాలో వుంది. అందుకే

అంటున్నా— ఈ క్షణంలో అడుగు వెనక్కిపడితే ఆ అడుగు కూడా వూడుతుంది. ఆ అడుగే ముందుకుపడితే సామాన్యుడు సమాజగతినే మారుస్తాడు. శ్రమను గౌరవించి, తగ్గ ఫలితాన్నిచ్చే సమాజాన్ని సృష్టిస్తాడు. ఇంతవరకూ నేను చేస్తున్న సేవలన్నీ సమాజానికికావు. కలవాడి పొట్ట పెంచడానికే పనికొస్తున్నాయ్. నా కష్టంలో మెట్టు వాటా కాజేస్తున్నాడు కామందు. అందుకే సుఖాలూ, సంపదలూ బలవంతుల వంతైనాయ్; కష్టాలూ, నష్టాలూ బలహీనుల పరమైనాయ్. ఆస్థులన్నీ ఒకవైపు పోగు పడుతున్నాయి; సామాన్యుల అస్తికలన్నీ మరోవైపు కూలపడుతున్నాయ్....

మాకు ఆస్థుల్లేవు, అందుకేచావుని చూచి భయపడంమేం. ఉన్న ఆస్థల్లా మాశ్రమే. అదే త్యాగంకూడా. ఆ శ్రమతోనే మానవులపైనే కత్తి కట్టిన వాళ్ళచర్మం వొలిచేస్తాం,....అఁ!....ఇది తప్పదు. కల్లబొల్లి మాటలు నాకు నప్పవు. నా ఆకటిచిచ్చును చల్లార్చలేవు, చల్లార్చలేవు.... (ఇంకొంచెం నిష్క్రమణవైపుగా మూమెంట్ తీసుకుంటూ) నేనులేనిదే నీవులేవు, ఈ సంపదలేదు, ఈ అందాలూ, ఆనందాలూలేవు. మానవుడిగా, శ్రమజీవిగా నేను కోరుతున్నది—తినడానికి తిండి, కట్టబట్టా, అక్షరంముక్కా, చేతినిండాపనీ. కాని ఈ నాలుగింటికీ నన్ను దూరం చేస్తున్నవారిని గౌరవించాల్సిన అవసరం నాకులేదు. బతకడానికి నాకూ సమానావకాశాలు యివ్వండి. యివ్వలేమంటారూ, జీవితం నాకందిస్తున్న అనుభవాల జ్వాలల్లో, ఆగ్రహాల మంటల్లో పడి మిడతల్లా చావడానికి కూడా సిద్ధపడాలిమరి....ధ్వంసంచేసే హక్కు నీకెక్కడదంటున్నారా?! నేను సృష్టించిన సంపదే ఈ హక్కును కూడా నాకే యిచ్చింది. అందరికోసం సృష్టించిన సొమ్ము కొందరికే సొత్తు అయితే ఆ పొత్తును కత్తిపెట్టి చీల్చమంటోంది నా ఆకలి. చీలిన రెండింటికీ ఇకపొత్తు కుదరదు. ఆ పొత్తు కుదరకుండా వుంటేనే, తిరిగి నీ సంపద నీ సొత్తు!.... కలిమిలేములు కావడి కుండలంటే నేనంగీకరించను. ఆ రెంటిలో ఏదో ఒకటే జీవించాలి, ఒకటే జయించాలి. ఇక రాజీలేదు. ఓటమిని అంగీకరించలేను.... (బిడ్డ శవంవైపు చూపుతూ) ఈ నాబిడ్డ శవాన్ని కలవారికి కానుకగా యిచ్చిపోతున్నా (ఒక్షణం ప్రేక్షకులవైపు విచిత్ర ఆవేదనతో

చూస్తూ)... జీవితాన్ని ప్రేమించినవాణ్ని. అందుకే ఆ హక్కుని కాపాడుకునే సమరంలో తోటివారితో కలసిపోతా !

(నెమ్మదిగా తెరపడుతుంది. నేపథ్యంలో)

మరో ప్రపంచం — మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది !
పదండి ముందుకు —
పదండి త్రోసుకు
పోదాం, పోదాం, పైపైకి.

(ఈ నాటికలో శ్రీశ్రీ, కరుణశ్రీల పాటలు వాడుకున్నాం. ఆ కవులకు కృతజ్ఞత.)



# విప్లవాక్షి రెప్పల్లో

డా॥ సి. నారాయణరెడ్డి

పువ్వుల భాష కాదు
నవ్వుల భాష విను.
నవ్వుల భాష కాదు
ముసలి ఆటవెలది విసుగులేని పదాల
మువ్వల భాష విను.
అప్పుడుగానీ అలిసిన గుండెల
డప్పుల చప్పుడు తెలియదు.
అప్పుడుగానీ వాడిన దండల
ఆవిరితావులు తెలియవు.
ఒక సర్తాజ్ ఒక ముంతాజ్
ఊపిన పాటల ఉప్పెన
చాపిన సైగల విచ్చెన
ఎగరేసే ఎత్తులు తెలుసు నీకు.
నెమరేసే మత్తులు తెలుసు నీకు.
అంతటితో సరిపోదు మరి.
అందాల లతాంతాలను
ఆవిష్కరించే లతికల బతుకుల
ఆ త్రిమూర్తులకు వెలలేదు మరి.
వెలకట్టే రవ్వలుంటే
వెన్న దాచుకున్న పాలసంద్రాలను
గిలకొట్టే కవ్వముంటే

చిలికి చూడు.
గుండెల సవ్వడి
డిండిమాల అలజడి
కొలిచి చూడు.
తెల్లారేజామున మూడు గంటలకు —
సళ్ళిన కీళ్ళమాటున
చల్లారని చిమ్మచీకటి మంటలకు —
సిరివరులకు —
పురహరులకు —
కలిగిన గర్భరోదన కను.
విరిగిన వీణావాదన విను.
ధూమభామ ముంగురులమాటున
రోమాంచితాన్ని పాతివేసిన
విశ్వాదాభిరామ వేదన కనుగొను.
అప్పుడే నిన్ను నేను మెచ్చుకునేది.
కప్పిన విప్లవాక్షి రెప్పల్లో
చిచ్చుపాప పిచ్చుకునేది.

# పిరికిగా చావకు

వేనరెడ్డి

ఛీ ఛీ! ఇదేం చావు
పిరికి చావు, మురికి చావు.
పుండాకోర్ భూతాలకు
భయంగా వడ్డించే

పిండాకూడు చావు
దండుగ చావు.

ఒరేయ్!
కోరికల ఊరేగింపులకు బెదరి
గుండె చెదరి
ఉరేసుకుంటున్న బ్రూట్
నువ్వంటే రోత.

పారేసుకున్న కలల్ని ఏరుకునేందుకు
పూలతోటనుకుని నిప్పుల పొలంలో
కాలిపోతున్న ఫూల్
నువ్వంటే జుగుప్స.

అరిగించుకోలేని కష్టాల్ని
కరిగించే మందుగా
విషాన్ని సేవిస్తున్న ఇడియట్
నువ్వంటే వెగటు.

బ్రతుకునించి బాధ్యతల్నించి
పారిపోతున్న చవటా!
నిన్ను క్షమించలేను.

అరే!
నువ్వు మనిషివి
పుట్టుకతోనే నీ గుండెలో విరిసిన చైతన్యం
నీకు వరం
నీ చావూ బ్రతుకూ నీ ఒక్కడి సొత్తుకాదు
సంఘపరం.

జడంగా, బ్రతుకునుంచి ఎడంగా
ఉండటం నీకు తగదు, అది బ్రతుకుకాదు
నీకు తెలియదా
నీ నరాల్లో విద్యుత్తు ఉంది
పిరికి కాదు.
నీ ఎముకలో చెకుముకి ఉంది
వణుకు కాదు.

లే
ఎదలో ఓమూల పడుకున్న
ధైర్యాన్ని నిద్రలేపు.
సడలి చల్లబడిపోతున్న
సంకల్పాన్ని మళ్ళీ వెచ్చగా కాపు.

కదులు.
నువ్వు చూడాల్సింది
పడమటికి కాదు.
తూర్పుకు, నావైపుకు.

# భయంకర వర్తమానం

*అద్దేపల్లి రామమోహనరావు*

భయంకరమైన వడ్డీలతో ఉరితాడు పేని
గొంతుచుట్టూ గట్టిగా బిగించి రక్తం కక్కిస్తూ,
చావనివ్వక బతకనివ్వక
సాటిమనిషి నెత్తురుబొట్లని రూపాయిలుగా మార్చుకునే

దుర్మార్గులైన వడ్డీవ్యాపారులు కక్కించిన నెత్తురు
వీధివీధిలోనా అడుగుల్లో వెచ్చగా ఇంకిపోతుంటే —

ఆకలి పెనుమంటలుగా రగిలి
ఎముకల్ని నమిలేసి, మాంసాన్ని కొఱుక్కుతిని, రక్తాన్ని తాగివెయ్యగా
ఊపిరిమీద చుట్టబడిన చర్మపుబొమ్మల్లాగా మిగిలిపోయి
తమ జాలిచూపులతో భారతదేశ భవిష్యత్తుని శపిస్తున్న
పసిపిల్లల మరిగే కన్నీరు సూటిగా నా గుండెమీద పడి
వేడివేడి పొగలై వెలికి వస్తుంటే —

క్రూర దురధికారుల ప్రపంచమంతటి నోటిముందు

తమ రక్త మాంసాలు
తమ ఉద్యోగాలు  అన్నీ ఫలహారాలు కాగా
తమ భార్యలు
తమ జీవితాలు

కాలపు చీకటికోణాల్లో కన్నీటిని మూటకడుతూ
బ్రతుకుబండని మొయ్యలేక పడుతూ లేస్తూ, పడుతూ లేస్తూ పోతున్న
అసంఖ్యాక దౌర్భాగ్యుల దుస్సహదీర్ఘ నిశ్వాసాలు
నా నాసికా రంధ్రాలదగ్గిర కాలకూట విషజ్వాలలు కల్పిస్తుంటే —

సమాజంలో తెలివిగలవాళ్ల జేబుల్లో యిమిడిఉండి
వాళ్ళు బయటికి తీసి స్వార్థపు కీ తిప్పి నడిరోడ్డుమీద వదిలినప్పుడు
దోపిళ్ళు, హత్యలు, మానభంగాలు, గృహదహనాలుచేస్తూ
తమ బ్రతుకుమీద తామే పెట్రోలు పోసుకుని నిప్పంటించుకునే
దురదృష్టవంతుల పెళ్ళాల, బిడ్డల, బంధువుల ఆర్తనాదాలు
నా కర్ణరంధ్రాలలో పిడుగుల్ని బద్దలు కొడుతుంటే —

కంఠంలో ఫిరంగులు కలవాళ్లు
కళ్ళల్లో తళతళలాడే ఖడ్గాలు గలవాళ్లు
నవ్వుల్లో ఈటెలూ, కౌగిళ్లలో బాణాలు దాచుకున్నవాళ్లు

తాను వేయబోయిన అడుగుకింద గోతిని తీసి, పడదోసి, నెత్తినెక్కి
నాట్యమాడుతూ వికటాట్టహాసం చేస్తుండగా
తన కన్నీటిధారలు భూమాత చెక్కిళ్ల మీద యింకిపోతుండగా
పుట్టెడు దుర్విధిని బుజాలమీద మోస్తున్న నోరులేని అమాయకుల
శాపాలు
నా అంతరాత్మని అనుక్షణమూ తూట్లు తూట్లుగా పొడుస్తుంటే —

ఓ మిత్రుడా !
ఆలోచన స్తంభించిపోయి
గుండె దిమ్మెక్కిపోయి
బ్రతుకు బరువై పోయి
నవ్వలేను : నోరు తెరవలేను : అడుగు ముందుకు వెయ్యలేను —

దేశభవిష్యత్తు నాముందు భూతంవలె జడలు విరబోసుకుని నర్తిస్తున్నది
భవిష్యదగాధాలలో తలపగిలిన మనిషివేసే జాలికేక
నా గుండెను పిండివేస్తున్నది —

భవిష్యద్భూతాన్ని నామరూపాలులేక నశింపజెయ్యడానికి
భవిష్యన్మానవుణ్ణి సంపూర్ణవ్యక్తిగా తీర్చిదిద్దడానికి
నీ హృదయరక్తాన్ని దానంచేస్తానని
నీ నరాలసత్తువ నా జోలెలో నింపుతానని
నీ సర్వచైతన్యాన్ని నా ఊపిరిలో నిండిస్తానని
నా ప్రియతమ మిత్రమా !
నాకీ క్షణమే వాగ్దానం చెయ్యి !

నీ వాగ్దాన మందుకునేదాకా
నా కంఠనాళం నిర్భయంగా విచ్చుకోదు !
నా గుండెకు కదలికరాదు !
ఈ అనంత సమస్యాపరిపీడిత భయంకర వర్తమానకాలంమీద
నేను నిర్భయంగా ముందడుగు వెయ్యలేను —

స మీ క్ష లు

# మ హో ద యం

శ్రీ కె. వి. రమణారెడ్డి మహాకవి గురజాడ జీవితాన్ని, సాహిత్యాన్ని సమీక్షించే ధ్యేయంతో 'మహోదయం' రచనకు పూనుకున్నారు. గత 20 యేండ్లుగా అభ్యుదయ రచయితల సంఘం, విశాలాంధ్ర ప్రచురణాలయం గురజాడ అప్పారావుగారి సాంస్కృతిక పాత్రను వెలుగులోకి తెచ్చేందుకు కృషిచేస్తున్నాయి. శ్రీ అవసరాల సూర్యారావు గురజాడ సాహితీ కృషిని, జీవితాన్ని పరిశోధించారు. శ్రీరమణారెడ్డిగారు కూడ 1963 లో 'గురజాడ వెలుగుజాడ' అంటూ ఒక పుస్తకం రాశారు. ఇప్పుడు రెండవ ప్రయత్నంగా, మరింత విస్తృత పరిశీలన ఆధారంపై మహోదయం ప్రచురణకు పూనుకున్నాడు.

కీ॥ శే॥ గురజాడ అప్పారావుగారి భాషా, సాహితీ సేవ ముఖ్యంగా ఆయన విజయనగర రాజాస్థాన ఉన్నతోద్యోగంలో ఉంటూండగానే కొనసాగింది. ఆ రోజులలో విజయనగర ఆస్థానం పలువురు కవిపండితులకు, కళాకారులకు ఆశ్రయం ఇచ్చింది. మధ్యయుగ చరిత్రలో సాంస్కృతిక వ్యాసంగానికి రాజాస్థానాలు లేక దేవస్థానాలతోకల 'భూస్వామ్యోచిత' సంబంధపు నిరంతరమైన గొలుసునుచూస్తాం. ఆంధ్రలో ఆనందగజపతి ఆస్థానాన్ని ఆ గొలుసు తుదిలంకెగా పేర్కొనవచ్చు. కనుక, గురజాడ అప్పారావుగారి కాలాన్ని భూస్వామ్య సాంస్కృతిక పునాదులు లుకలుకలాడిపోతూ బూర్జువా ప్రజాతంత్ర భావోద్గమనం తెరవెళ్ళుతున్న క్రమానికి చెందిన దశగా చెప్పవచ్చు.

గురజాడ అప్పారావుగారి 'దేశమును ప్రేమించుమన్నా' అనే గేయం అపురూప భావసమగ్రతతో అనితరసాధ్యవిలక్షణతను ప్రదర్శించిన విషయం అందరికీ తెలిసి యున్నదే. అలాగే కాలికిందభూమిలేని (displaced) కథానాయకుడు గిరీశంపాత్ర అనన్య ప్రచారం పొందింది. ఆనాటి గ్రాంథిక, వ్యవహార భాషా వాదవివాదాలలో వందలాది పండితచర్చలకంటె, వేలాది విమర్శక తర్కవితర్కాలకంటె ఒక్క కన్యాశుల్క నాటకమే అధిక ప్రభా

వోత్పాదక విలువలు సంతరించిందన్నది నిస్సందేహాంశం. రాసిక్యతాగుణ ప్రభావం (aesthetic effect) దృష్ట్యా గురజాడవారి గిరీశం, మధురవాణి పాత్రలు ఆంధ్రసాహితీ చరిత్ర నవ్యత యొక్క 'మలుపుకు' తొలి మైలు రాళ్ళుగా స్థిరపడిపోయాయి.

'మహోదయం'లో శ్రీ రమణారెడ్డి గురజాడవారి అనేక రచనలు, అనేక జీవితసంఘటనలను సమీక్ష చేశారు. అప్పారావుగారిపై వెలువడిన నానా ఖండనమండనలను, వాటిలోని ఔచిత్యానౌచిత్యాలను వివరించ ప్రయత్నించారు. గురజాడ రచనలలోని నవ్యత్వవిలక్షణతలను, ఆయన ఆయా భావాల వెనుకగల సాంఘిక పునాదిని సమన్వయించుటకై కూడ కృషిచేశారు. అందువల్ల ఈ పుస్తకం నేటి సాహిత్యాభిమానులకు ముఖ్యంగా పఠనయోగ్యమౌతూఉంది.

గురజాడ సాంస్కృతిక కృషినిగూర్చి అనేక అపోహలు నాడూ, నేడూ ఉంటూ ఉన్నవే. ముఖ్యంగా ఇటీవల కాలంలో ఆయనను షేక్స్‌పియర్‌తో పోల్చినవారు, వేమనతో తూచినవారు, వాల్మీకితో కొలిచినవారు, వర్డ్స్‌వర్త్‌తో ముడిపెట్టినవారు, ఆయన కన్యాశుల్క కర్త కాదన్నవారు, ఔనన్నవారు, కన్యాశుల్కం గొప్ప నాటకం అన్నవారు, క్షుద్రప్రహసనం అని త్రోసిపుచ్చిన వారు పెక్కు మంది ఉన్నారు. ఇలాంటి ధోరణులను 'చదును' పరచడంలో రమణారెడ్డిగారు విమర్శను బాధ్యతాయుతంగానే నిర్వహించారు. ముఖ్యంగా, మహోదయంద్వారా చాలా క్రొత్త సాక్ష్యాధారాలను వెలుగులోకి తేవడంలో కృతకృత్యులయ్యారు.

అప్పారావుగారు సంస్కృతాంధ్రాంగ్ల భాషా కోవిదుడు. సాహితీవేత్త. మదరాసు విశ్వవిద్యాలయ బోర్డ్ ఆఫ్ స్టడీస్ సభ్యులుగా పనిచేశారు. వ్యవహారిక భాషా ఉద్యమంలో పాత్ర వహించి, 'డిసెంట్‌పత్రం' ప్రవేశపెట్టారు. వీటన్నిటితో పాటు ఆయన ఆస్థాన వ్యవహారాల్లో, వాటికిచెందే కోర్టు వ్యాజ్యాలలో దక్షతతో పనిచేశారు. గురజాడ అప్పారావుగారు దేశాన్నీ కాలాన్నీ చూచి తెలిసి కొన్నవారని కూడ చెప్పవచ్చు. నీలగిరి పాటలు, ముత్యాలసరాలు, బిల్హణీయం, మున్నగు గేయాలు, కథలు, విమర్శలు, లేఖలు, డైరీలు వ్రాసి ఆయన సాంస్కృతికంగా తన వ్యక్తిత్వాన్ని, ప్రత్యేకతను ఆంధ్ర పాఠకలోకం ముందు ప్రదర్శించి బహుళ సమాదరణను చేకూర్చుకొన్నారు. ఈ అంశాలన్నీ

మహోదయంలో కథన వస్తువులుగా ఉన్నాయి. ఆయా విషయాలను గూర్చి శ్రీ రమణారెడ్డి సుదీర్ఘ వివరణలను కూడ ఇచ్చారు.

గురజాడను సమకాలిక మేధావులతో పోల్చి విలువలుకట్టే సందర్భంలో నేమి, గురజాడ తత్వనిరూపణ అంటూ ఆయన భావాలను సాగదీసి వివరించే సందర్భాల్లోనేమి, గురజాడ వ్యక్తిగత శీలాన్ని వెనుకవేసికొని పొరపాట్లను సమర్థించే సందర్భాల్లోనేమి శ్రీ రమణారెడ్డి అతివివరణవైఖరికిగాని, లేక అసందర్భధోరణికిగాని లోనయ్యారా అనిపించే ఘట్టాలు కూడ మహోదయంలో లేకపోలేదు. కాంగ్రెసు మహాసభా ప్రసంగాలపై గురజాడ స్వీయోద్దేశాలుకాని, బంకించంద్ర, వీరేశలింగం పంతులులాంటివారి 'సత్తా'పై గురజాడ స్వాభిప్రాయాలుకాని, ఆంటినాచ్ ఉద్యమం విషయంలో గురజాడవారి అభ్యంతర వైఖరులుకాని—ఇలాంటి భాగాల సమర్థనలో శ్రీ రమణారెడ్డి అనావశ్యక అతివివరణ (hairsplitting) లో కొట్టుకొని పోయారనిపిస్తుంది. అలాంటి భాగాల్లో అసలు గురజాడ ఆంతర్యంకంటె శ్రీ రమణారెడ్డి ఉద్దేశ్యాలే మొదటి స్థానం పొంది వస్తు విషయం ప్రక్కబాట పట్టిన సందర్భాలుకూడ అగుపిస్తాయి.

క్రీస్తుపూర్వపు ఎథెన్స్‌లో హెటైరాలతో సంస్కారుల సంపర్కాన్ని గొప్పగా పేర్కొంటూ గురజాడవారు రాజావారి మెప్పుకొరకై వేశ్యలయిండ్లకు 'తరుచు' వెళ్ళడాన్ని లేక రాజావారి ఉంపుడుకత్తెలను మచ్చిక చేయడాన్ని సమకాలిక నాజూకుదనంతోను విశాల కారుణికవాదంతోను ముడిపెట్టడాన్ని సముచిత వివరణగా స్వీకరించలేము. 'కోకో వైను తప్పలేదు.' 'మాంసాహారం కూడ అలవడింది'అని చెప్పేటప్పుడు వ్యక్తిత్వ సమస్య ఉదయించే పనేమిటి?.... 'సేవకుడు అని (రాజా) వారి ఆహ్లాదంకొరకో, తృప్తికొరకో తననుతాను తగ్గించుకొని యుండవచ్చునేకాని తాను మంత్రిననే తన ధీమా ఉంది!' అన డంలో ఔచిత్యం శూన్యమే. అలాగేఐతే 'తన శత్రువులకేమోగాని కన్న బిడ్డకు కూడ జమీందార్ల కొలువువద్దని బాధపడటం' ప్రసక్తి రాదుకదా!.... 'జనా లోకులచే నీతిజ్ఞుడనిపించుకున్నాడు; ఆకాలానికి అది వన్నె' అని కాని పనులను సరిపుచ్చుకొనే తీర్పుధోరణి మంచిదికాదు. ఇలా వ్యక్తులను అతీతస్థాయా (preveleged position) లో ఉంచి వారి సంకీర్తనలోపడిపోయే నాయకారాధన (hero worship) పోకడ అక్కడక్కడ కనపడుతుంది. ఆయా సంద

ర్భాల్లో శ్రీ రమణారెడ్డి అధిక అదుపు (restraint) తో వ్యవహరించాల్సి యుండిరని తోస్తుంది.

వ్యక్తులు బలహీనతలకు, నైచ్యాలకు లోనవటానికి బాధ్యత వారికేకాక, వారికంటె అధికంగా సమాజ వ్యవస్థకు వర్తించగలదనే అంశాన్ని అప్పారావు గారు సరిగానే గమనించారు. అందుకని సాంఘిక వ్యవస్థను అలాగే ఉంచా లంటూ, యే కతిపయ వ్యక్తులనో ఉద్ధరించి తృప్తిపడే సంఘసంస్కర్తల ధోర ణితో ఆయన ఏకీభవించలేదు. అంతవరకు ఇబ్బందిలేదు. కాని వేశ్యావృత్తి బహిష్కార ఉద్యమ విషయంలో 'వేశ్యలు వివాహాలు చేసికొని తమ జీవితాలను యే ఒక్కరికిమాత్రమే సంపూర్తిగా అప్పగించి శాశ్వత దాస్యానికి లోనవటానికి సమ్మతించరనీ, లేక సమాజంలో పురుషులకు మాత్రం లైంగిక స్వేచ్ఛ ఉంటూ వివాహిత స్త్రీలకులేనిస్థితిలో వేశ్యావృత్తిని తొలగించాలనడం నీతికాదనీ' సాకులు చూపడంలో అప్పారావుగారు పెడమార్గం పట్టారన్నది కప్పిపుచ్చలేము. ఆయన దివానుగారు. తమ ఆస్థానంలో వేశ్యావృత్తికి ప్రోత్సాహ పోషణలు పూర్తిగా ఉన్నాయి. కనుక, వీరేశలింగం పంతులుగారివలెనో రఘుపతి వేంకటరత్నం గారి వలెనో ఆయన బహిష్కరణ ఉద్యమంలో నేరుగా దూకటానికి వీలులేదు. కనుక 'ఆయన వేశ్యల ఈనాములు వారి స్వంత పట్టాలుగా మార్చనిదే పడుపు వృత్తిని బహిష్కరించే యత్నం అన్యాయం' అని ఆక్షేపించాల్సివస్తుంది.... ఇలాంటి సందర్భాల వ్యాఖ్యానంలో శ్రీ రమణారెడ్డి అప్పారావుగారిని వెనుక వేసికొని రావడంలో అర్థం కనపడదు.... సంఘ సంస్కరణ నినాదాలుఇచ్చే సందర్భాల్లో ఆ సంస్కరణలవల్ల రాగల సాధకబాధకాలన్నిటికీ ముందే రక్షణ హామీలను గ్యారంటీ చేయడం జరగదని శ్రీ రమణారెడ్డికి తెలియని విషయ మేమీకాదు. నిజంలో సాధకబాధకాల నివారణ సమస్య ఉద్యమ నినాదాలిచ్చే వారి చేతుల్లోకాక ప్రచలిత ప్రభుత్వ యంత్రాంగానికి చెందియుంటుంది. కనుక నివారణ హామీలను ముందే ఇవ్వాలనే షరతు విధించే తీరుకు ఉద్యమాలు తెచ్చే సమస్యకాని, లేక చరిత్రలో పురోగమనంవచ్చే సమస్యకాని పలాయనవాద సాగరంలో స్వాహా కావలసి వస్తుంది, అందువలన గురజాడవారు చేసిన అభ్యంతర వాదనలవెనుక ఆయన 'దివాన్గిరీ' ఆస్థాన 'సేవా' పరిమితులు పని చేసిన విషయాన్ని కానేకాదని వాదించటంలో అర్థం ఉండదు.

కాంగ్రెస్ మహాసభలపైన గురజాడవారి (సినిసిజం) ఈసడింపు విమర్శా ఫక్కీకూడ — వాద వివాదాల తర్క మెలా ఉన్నప్పటికీ – విజయనగర ఆస్థా

నాభిరుచులకు, జస్టిస్ పార్టీ మూలక అభ్యంతర ధోరణుల ప్రభావానికి లోనై అపసవ్యమార్గంపట్టాయని శ్రీ రమణారెడ్డిగారు గమనించకపోవడం ఆశ్చర్యం కలిగిస్తుంది. అలాంటి విషయాల్లో పరిపూర్ణ వీక్షణతో (radicalism) పొత్తుగలిపి సమర్థించడం, కావాలని వస్తువిషయాన్ని అస్తవ్యస్తం చేయడం అవుతుంది.

కన్యాశుల్కం నాటకం సాహితీసంతులన విషయంలో స్వయంగా గురజాడ అప్పారావుగారే 'ఏ కామిక్ ప్లే' అని చెప్పిన అంశాన్ని త్రోసిపుచ్చలేము. అప్పారావుగారు వినోద ప్రాధాన్యతతో రచనను నడిపించారు. హాస్యంకొరకై బుణాత్మక స్వభావాలను ప్రదర్శించారు. పాత్రల చరిత్రహీనత, నిస్సార్థకత, అవికాసదౌర్బల్యం, అలగాతనం, నైతికరాహిత్యం, అవకాశవాద క్షుద్రత్వం మున్నగు అల్పత్వ వైఖరులపట్ల నవ్వుపుట్టించటానికి పూనుకొన్నారు. గిరీశం అవకాశవాదం, మధురవాణి గడుసుదనం, బుచ్చమ్మ అమాయకత్వం, రామప్పంతులు లౌక్యం, కరటకశాస్త్రి అఘాయిత్యం, మీనాక్షి పెంకితనం, అగ్నిహోత్రావధానుల అహంకారం, లుబ్ధావధానుల మూర్ఖత్వం, మిగిలిన పాత్రల ఆయా అవలక్షణాలు వెక్కిరింపుకొరకై గుదిగ్రుచ్చబడినవే- కాని వేరేమీకాదు. కనుక పాత్రల ఆయా స్వభావాలను హాస్యోచితంగా యాథాలాపరీతిలో పరిగణించవలసి యుంటుంది. హాస్యపాత్రలను శృంగార, వీర కావ్యపాత్రల ఉదాత్తత్వ స్వభావాలతో ముడిపెట్టి విలువలు కట్టడం అపసవ్య అన్వయ ధోరణి అవుతుంది. వీర శృంగారాలలో విలువల 'సక్రమ' (active) పరిగణనకథన బాధ్యతకాగా హాస్యంలో విలువల రాహిత్యం కథనాంశం అవుతుంది. హాస్యపాత్రలలోని బలహీనతలపట్ల వర్తించే ఉదారవైఖరిని మానవతావాద కారుణికత్వమంటూ ఒకానొక క్రియాత్మక 'తత్త్వం'గా చిత్రించి ధనాత్మకవృత్తిని (positive character) ఆపాదించడం పొసగదు. నిజంలో, బలహీనతలపట్ల సానుభూతి ఆంతరనైజం ఆ బలహీనతల నిరాకరణేకాని ప్రోత్సాహంకాదు. కనుక కన్యాశుల్కంలో 'నీతి' సమస్య లేకపోవడం అదీ గుణవిశేషమే అని వాదించడంలో అర్థంకనబడదు. మధురవాణిలో పరిణతి ఉండదు. ఆ పాత్ర స్థాణువుగానే నిల్చిపోతుంది. ఆ విషయాన్ని పేర్కొంటూ శ్రీ రమణారెడ్డి 'మధురవాణి చింతామణితోగాని, వసంతసేనతోకాని పోటాపోటీలో నెగ్గుకు రాగల్గేదిక్కడే' అని నిష్కర్షచేయబూనడం ఆశ్చర్యం గొల్పుతుంది.... ఏ రామప్పంతులుతోనో 'సానుల్లోమాత్రం నీతి ఉండదుటండీ!' అని ఒక వాక్యం

విసిరినంతమాత్రాన మధురవాణి పాత్రను సతీసావిత్రితో ముడిపెట్టి సమానస్థాయి నివ్వగలమా తోచదు. మధురవాణి పాత్రలోని మంచితనం, చురుకుదనం మోకాటిబంటివి మాత్రమే. వాటికి సక్రమోత్తేజన కల్గించే స్థాయి యుండదు. కనుక, హాస్యపాత్రల, ఉదాత్తపాత్రల స్వభావప్రేరణలను ఒకే గాటగట్టడం అర్థరహితమే....

కన్యాశుల్కం విషయంలో 'it is a glow with a life in which nature and custom, reason and tradition, sentiment and superstition are in immeasurable conflict' అనే కట్టమంచి రామలింగారెడ్డిగారి విశదీకరణను 'రసం' యొక్క సిద్ధిగాకాక రసాభాసయొక్క సిద్ధిగా గమనించాల్సి యుంటుంది. ఇంతకూ గిరీశం దుష్యంతుడు కాజాలడనీ, మధురవాణి శకుంతల కాజాలదనీ 'భిన్నత్వ' భూమికను గమనించుటకై పెద్దగా తర్కంతో పనియుండదు....

మహోదయం రచనలో కొన్ని ఘట్టాలు విమర్శ స్థాయినుండి 'గాసిప్' (కబుర్ల)స్థాయికి దిగజారాయనిపిస్తుంది. 'సుభద్ర' రచన ప్రసక్తిని పేర్కొంటూ 'పండిత వ్యవస్థ తనపై విసిరిన సవాలు నందుకొని గ్రాంథిక భాషలో, వృత్త ఛందస్సునుకూడ తాను నిర్వహించగలనని చూపేందుకోసమే (అప్పారావుగారు) ఈ రచన చేయాల్సి వచ్చింది.' అని శ్రీ రమణారెడ్డి వాదన చేశారు. కాని ఆ వ్యవస్థ యొక్క సవాలు నందుకోవలసిన పని, లేక ఆ వ్యవస్థను సంతోషపరచవలసిన అవసరం లేక అందుకై ఒక కావ్యాన్నే వ్రాయవలసిన కుక్కుర్తి గురజాడలాంటి స్వచ్ఛందశీల వ్యక్తికి, అందులోను తీవ్రవ్యవహార భాషావాదికి యెందుకో బోధపడదు. పోతే, ఈ విషయం రచయిత ఊహాగానమా లేక వాస్తవమా అనేదికూడ సందేహాస్పదమే....

మరొకచోట 'అప్పారావుగారు రష్యను సాహిత్యాన్నికూడ పరిశీలించాడో యేమో, గొగోల్ రాసినది ఇన్స్పెక్టర్ జనరల్ నాటకంలో క్లెస్టకాఫ్ పాత్రలోకూడ గిరీశానికి పోలికలు కనిపిస్తాయి.' అని వ్రాశారు. ఈ వాక్యంలో ప్రథమార్థం కేవల అలంకారిక ధోరణేకాని వాస్తవాంశకు వర్తించేదికాదు. అలాగే, గొగోల్ కూడ గురజాడ ప్రభావానికి లోనయ్యాడేమోనని రచయిత సరదాగా అనుకోవచ్చు. కాని, ఇలాంటి వాగ్విన్యాసం కవితకేకాని విమర్శలకు, చరిత్రలకు చెల్లుతుందా అలోచనీయం. ఎలాగైనా, విషయ వివరణరీతితోపాటు వాక్యవిన్యాసశైలి విషయములోను శ్రీ రమణారెడ్డి ఇతోధిక శ్రద్ధ వహించాల్సిందనిపిస్తుంది.

రమణారెడ్డిగారు మహోదయంలో 500 పుటలలో విరివిగా విషయ సామగ్రి పొందుపరచారు. గురజాడ సమకాలిక మేధావులను, నాటి సాంస్కృతిక ధోరణులను–ఆయా రంగాల్లోని విభిన్నపోకడలను సమీకృత రూపంలో తెలుగు పాఠకలోకం ముందుంచి ఆలోచనలను ప్రేరేపించ ప్రయత్నించారు. గురజాడ వారు కథానాయకులు కనుక–కథా స్థలమైన విజయనగర ఆస్థానం రూపురేఖలను కూడ కొంతవరకు వెలుగులోకి తెచ్చారు. అందువల్ల వారు చేసిన ఈ కృషి నిస్సందేహంగా అభినందనీయమైనదని భావిస్తున్నాం...

గురజాడ నాటి మేధావులలో ఆత్మవిశ్వాసం, ఆశావాదం, బహిరంగ ఆలోచనా పరత్వం, గ్రంథ కర్తృత్వ ఉత్సాహం. సంఘ సంస్కరణశీలం, సాహిత్య సంగీత నాటక కళాభిమానం, నవ్యతాశీల ఉద్వేగం సమున్నత ప్రమాణంలో ఉద్గమించిన దృశ్యం చూస్తాము. అందువల్ల ఆకాలాన్ని వైతాళిక యుగ మనడం సముచితమే. ప్రాచీన సంస్కృతీ విలువలనుండి, పాశ్చాత్య సంస్కృతీ విలువలనుండి అపూర్వ ప్రేరణపొందుతూ ఈ రెంటి విశిష్ట సమ్మేళన ద్వారా రూపు దిద్దుకున్న నవ్యజాతీయ చైతన్యమూలిక ఆత్మోద్దీపనతో పూర్ణవ్యక్తిత్వ సాధనకొరకై అన్వేషణా పరాయణులైన నాటి వైతాళికులలో గురజాడ అప్పారాయ మహాకవికి సమున్నత స్థానం ఉందని వేరుగా చెప్పవలసిన పనిలేదు. ఆ స్థానాన్ని నిరూపించుటలో శ్రీ రమణారెడ్డిగారు చాలవరకు కృతకృత్యులయ్యారనే చెప్పాల్సి యుంటుంది.

శ్రీ అవసరాల సూర్యారావు వ్రాసిన గురజాడ డైరీలను పేర్కొంటూ 'గురజాడ ప్రజాతంత్రవాది కావచ్చు కాని రాజభక్తుడుకూడ. అట్లని దాసాను దాసత్వం ఆయన కెన్నడూ అలవడలేదు. కాబట్టి సూర్యారావు కాని, మరొక రెవరైనాకాని ఆయన తరఫున వకాల్తాపుచ్చుకొనడం అనవసరమనిపిస్తుంది.' అని రమణారెడ్డిగారు వ్యాఖ్యానించాడు, భక్తివేరు దాసత్వం వేరుకావచ్చు. పదవులు ఉన్నతమైన కొద్దీ దాసత్వ చిహ్నాలు తగ్గిపోయి భక్తి చిహ్నాలు యెక్కువగా గోచరంకావచ్చు....ఐనా, రెంటి స్వభావమూ ఒకేకోవకు చెందవలసియుంటుంది. కనుక, సూర్యారావుగారు 'పుచ్చుకున్న వకాల్తానే' రమణారెడ్డిగారు మరొక విధంగా పుణికి పుచ్చుకొని గురజాడ అప్పారావుగారి పరిమితులను యెత్తిచూపిన వారిపైన 'జమీందార్ల చంకబిడ్డ' అన్నందుకు ఆక్షేపించడంలో పసలేదు. ప్రఖ్యాతుల జీవితాల్లో నేపథ్యగతవైయక్తిక అపస్వరాలు కొన్ని వ్యభిచారం,

జూదం, త్రాగుడు లాంటివి ఆయా సందర్భాల్లో వినవచ్చేవే. కాని ఆ లోపలేశాలు 'వ్యక్తిత్వం మానవాంశను సంతరించుకొనడానికి' ఆధారభూతం కానక్కరలేదు. కనుక వాటిని కప్పిపుచ్చడంలాగే, శ్లాఘించే వైఖరికూడ విపర్యాసమే అవుతుందని రమణారెడ్డిగారు గమనించాలి. ఏది యెలాగైనా, నవ్యాంధ్ర కవిత విషయంలో కథ విషయంలో నూత్న విలోకనకూ, నూత్నశైలికీ ఆద్యుడు గురజాడ అప్పారావుగారే. 'తెలుగులో నవ్యరీతులకు, నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే' అని అప్పారావుగారు స్వయంగానే చెప్పుకున్నారు. పిదపటి కవులపైన ఆయన నవ్యవీక్షణ ప్రభావం ఎంతగానో ప్రసరణ చెందియుందికూడ. కనుక, సాహిత్య దృష్ట్యా మహోదయం ద్వారా అప్పారావుగారి వైతాళికపాత్రకు ఆవశ్యకన్యాయం చేకూర్చినందులకు రమణారెడ్డిగారిని ప్రత్యేకంగా అభినందించాల్సి యుంటుంది. ఒక్క మాటలో తెలుగు సాహితీ లోకానికి మహోదయం అవశ్య పఠనీయం—

— పా. సదాశివరావు

# ముసురు

[కథల సంపుటి. రచయిత : పెద్దిభొట్ల సుబ్బరామయ్య, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ – ఏలూరు రోడ్డు – విజయవాడ–2. వెల : 3–50]

ఈతరం కథకుల్లో పెద్దిభొట్ల సుబ్బరామయ్య ప్రత్యేకంగా చెప్పుకోతగ్గవాడు. ఆయన ఇప్పటికే రెండు మూడు కథల సంపుటాల్ని ప్రచురించాడు. ఈమధ్యనే వివిధ పత్రికల్లో వచ్చిన ఆయన కథల్ని ఈ "ముసురు" అన్న కథల సంపుటిగా విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ వారు ప్రచురించారు.

కథానికా ప్రపంచంలో తనదైన ఒక శైలిని సుబ్బరామయ్య యేర్పరచుకోగల్గాడు. ఈనాడు అసంఖ్యాకంగా వెలువడుతున్న చాలా కథల్లో లోపిస్తున్న "వాస్తవికత" సుబ్బరామయ్య కథల్లో పుష్కలంగా ఉంటుంది. ఏ డొంక తిరుగుళ్ళు లేకుండా సూటిగా, నిరాడంబరమైన శైలితో కథ చెప్పటం ఆయన అలవరచుకున్నాడు. ఆయన తీసుకునే వస్తువులో కొత్తదనం ఉంటుంది.

సమాజపు అట్టడుగున బతుకుతున్న దీనుల, హీనుల ఆర్తనాదాల్ని చిత్రించాలన్న తపన ఆయనలో ఉన్నట్టు కనిపిస్తుంది. చదివేవాడికి విసుగు కలగకుండా కథను నేర్పుగా, తెలివిగా అల్లే వాకచక్యం కూడా ఆయనకుంది.

కాని సుబ్బరామయ్య తీసుకునే ఇతివృత్తాల్లో ఉన్నంత కొత్తదనం గాని, సాహసంగాని, భావుకతగాని ఆయన ఆ ఇతివృత్తాల్ని కథలుగా మలచటంలో చూపించలేక పోతున్నాడనిపిస్తుంది నాకు. ఇందుకు కారణాలు రెండు. ఒకటి: మన సమాజాన్ని నడుపుతున్న శక్తులను గూర్చిన లోతైన అవగాహన సుబ్బరామయ్య కున్నట్టులేదు. రెండు: వాస్తవిక జీవితంలోని కుళ్ళును, చేదును అన్ని కాణాల్లోంచి లోతుగా చూపించే సాహసం ఆయనకు లేదనిపిస్తుంది. అలాగే యే సాంఘిక లక్ష్యాల్ని దృష్టిలోపెట్టుకొని ఆయన కథలు రాస్తున్నాడో ఆయనింకా తేల్చుకోనట్టున్నాడు. ఈ కారణాలవల్ల ఆయన కథల్లో లోతు తగ్గిపోయి సెంటిమెంట్ పాలు ఎక్కువైపోయింది.

పాఠకుడ్ని మెప్పించడానికి ప్రతీ కథకుడు కొన్ని ట్రిక్స్ ప్రయోగిస్తాడు. ఈ ట్రిక్స్‌లో "సెంటిమెంట్" చాలా శక్తివంతమైన ట్రిక్. వాస్తవ జీవితంలోని వివిధ సంఘర్షణల్ని ఒక స్పష్టమైన సాంఘిక లక్ష్యంతో కళాత్మంగా చూపించగల్గే నేర్పు, నిజాయితీ, సాహసం ఉంటే కథకుడు ఈ ట్రిక్స్‌మీద అతిగా ఆధారపడాల్సిన పనిలేకుండానే పాఠకుడిని తనవేపు తిప్పుకోగల్గుతాడు. ఇవి సరిపోయేంతగా లేవు కాబట్టి సుబ్బరామయ్య సెంటిమెంట్ అనే ట్రిక్కును తన కథల్లో అతిగా వాడుకున్నాడు. ఇక్కడ సెంటిమెంట్ అనటంలో నా ఉద్దేశ్యం మనిషిలోని కొన్ని మామూలు బలహీనతల్ని అదేపనిగా చిత్రిస్తూ వాడి మీద పాఠకుడి సానుభూతిని కురిపించేట్టు చెయ్యటం. కథల్లో సెంటిమెంట్ ఉండకూడదని నా ఉద్దేశ్యంకాదు. వాస్తవ జీవితంలో సెంటిమెంట్ చాలా ఉంది. అందువల్ల సెంటిమెంట్ కథల్లోను ఉండితీరాల్సిందే. కాని కథలో సెంటిమెంట్ ఉపయోగించుకోవటం కేవలం పాఠకుడిచేత రెండు కన్నీటిచుక్కలు కార్పించాలనే దృష్టితో గాకుండా వాస్తవానికి దర్పణం పట్టటంలో సెంటిమెంట్‌ను కూడా చాల అందంగా మాత్రమే తీసుకోవాలి. సుబ్బరామయ్య ఈ సెంటిమెంట్ మీద అతిగా ఆధారపడటంవల్ల ఆయన కథల్లోని ప్రధాన పాత్రలందరూ ఒకేలా గుంటారు. అందరిలోను ఒకే రకమైన బలహీనతలు, ఒకే రకమైన కోరికలు, కలలు. ఆయన పాత్రల్లో చాలామంది పిరికివాళ్ళు. వెన్నెముక లేనివాళ్ళు. ఏకాం

తంగా తమలో తాము జీవించటంతప్ప నలుగురిర్లోకీ వెళ్ళటం చేతకానివాళ్ళు. బాధపడటానికే పుట్టినట్టుగా బాధపడ్తుంటారు. సమాజం ఏదోరకంగా తమను బాధ పెడ్తోంటే నిశ్శబ్దంగా ఆ బాధను భరిస్తారు. కనీసం తమ మనస్సులోనైనా తిరగబడటం చేతగానివాళ్ళు. ఇలాంటివాళ్ళను తన కథల్లోపెట్టి వీళ్ళమీద పాఠకుడి హృదయాన్ని జాలితో నింపి, ఓహో! అనిపించుకోవాలని సుబ్బ రామయ్య చేసే ప్రయత్నాన్నిచూస్తే జాలేస్తుంది!

"ముసురు" అన్న కథలో సింహాచలం భర్తచనిపోయి నిరాశ్రయురా లైన పెరినాయకికి తన యింట్లో ఆశ్రయమిచ్చినందుకు ఆ ఊళ్ళో వీళ్ళిద్దర్నీ గూర్చి రకరకాల స్కాండల్స్ చెప్పుకోవటం మొదలౌతుంది. సింహాచలం వో కిరాణం కొట్టు యజమాని. యేదో కొనుక్కోవటానికి వచ్చినవాడల్లా సింహాచలం మీద కొంత విషాన్ని కక్కిపోతుంటాడు. సింహాచలం బాధపడుతుంటాడు. కాని, ఒక్కడితోనైనా "మీరంతా వెధవలురా! భర్త చనిపోయి తనబంధువులందరికి చాల దూరంలో ఉన్న ఒక అభాగ్యురాలికి నాయింట్లో ఆశ్రయమిచ్చాను. మాన వత్వం ఉన్న ఎవడైనా ఈపని చేస్తాడు. నేనూ అదే చేశాను" అనేంత సాహసం సింహాచలంలో కథకుడు చూపించడు. Flash back లో చెప్పబడిన తమిళ జంట సింగారవేలు పెరినాయకిలకు సంబంధించిన కథ వో కాశీమజిలీకథలాగుంది. ఈ కథను పాఠకుడు నమ్మేలా చేయటానికి రచయిత తగినంత శ్రద్ధతీసుకోలే దనిపిస్తుంది. 25 రూపాయలకు ఆశపడి, సీసాడు కిరసనాయలు తాగుతానని పందెం కట్టి, ఆ కిరసనాయిలు తాగి తెల్లారి చచ్చిపోయిన సింగారవేలు కథ చాలా చిత్రంగా ఉంది. సింగారవేలును ప్రేమించి తల్లిదండ్రులు పెళ్ళికి ఒప్పు కోకపోవటంవల్ల అతనితోపాటు పారిపోయి వచ్చిన పెరినాయకిని సింహాచలం ఇంట్లో చేర్చటానికి ఇంత కథను అల్లాల్సివచ్చింది. బయట అదేపనిగా రోజుల తరబడి కురుస్తున్న ముసురుకు సింహాచలానికి పెరినాయకికి సంబంధం అంట గట్టి వాళ్ళమీద ఆ ఊరివాళ్ళు కురిపిస్తున్న అపవాదుల ముసురుకు ఒక చక్కని సారూప్యత్యను చూపించ గల్గాడు రచయిత. ఈ కథలో గొప్పగా చెప్పుకో దగిందంటూ యేదన్నా ఉంటే ఇదే ననుకుంటాను.

"నిప్పుకోడి" అన్న కథలో సుబ్బరామయ్య రామకోటి అనే వస్తాదును ప్రవేశపెట్టాడు. ఒకప్పుడు రామకోటి కుస్తీలు పట్టి చాలా పేరుగడించాడు. గోల్డ్ మెడల్స్‌కూడా గెలుచుకున్నాడు. ఇప్పుడు వయస్సు మళ్ళింది. కుస్తీలు పట్టే

శక్తిపోయింది. అతని భారీ శరీరానికి ఇప్పుడు మిగిలింది ఆకలి! వయస్సులో ఉన్నప్పుడు కుస్తీలు పట్టిన వస్తాదుల గతి వయస్సు మళ్ళాక యేంకావాలి? వాళ్ళు ఎలా బతకాలి? అన్న సమస్యను లేవదీయటానికి సుబ్బరామయ్య ఈ కథ రాశాడా? రామకోటిని కొంతకాలము వో జమీందారు పోషించాడట. (ఆ జమీందా రిప్పుడులేడు. జమీందార్లు పోవటంవల్ల జరిగిన అనర్థాల్లో ఇదొక టేమో!) సరే. రామకోటి ఆకలితో వీథుల్లోపడి తిరుగుతుంటాడు– ముసురు కథలో సింగారవేలులాగ రామకోటి ఓ హోటళ్ళో 40 జతల ఇడ్లీలు తింటానని పందెం కడ్తాడు–40 జతల ఇడ్లీలు తినేస్తాడు–ఆ తెల్లారే బక్కెట్ తన్నేస్తాడు. కథను ట్రాజెడీ చేసి పాఠకుడ్ని యేడిపించానన్న తృప్తి తప్ప, కథ చివర్లో రామకోటిని చంపి రచయిత సాధించిన ప్రయోజన మేమిటో బోధపడదు.

సినిమారంగంలో 'ఎక్స్ట్రా' బతుకు ఎంత దుర్భరంగా, హీనంగా ఉంటుందో చూపడానికి 'ఎక్స్ట్రా' అన్న కథలో మంచి అవకాశం ఉంది. పెద్ద పెద్ద తారలేమో లక్షలకు లక్షలు సంపాదిస్తోంటే ఎక్స్ట్రాలుగా నటించే వాళ్ళు ఎంతో టాలెంట్ ఉన్నా అవకాశాలులేక ఎందుకూ కొరగాకుండా అతి హీనంగా బతుకుతున్నారు. ఈ కథలో సినిమారంగంలో జరుగుతున్న ఈ దోపిడిని కథకుడు చూపిస్తాడని ఆశిస్తే నిరాశే ఎదురౌతుంది. ఈ కథలో కూడా సుబ్బరామయ్య సెంటిమెంట్ తన ముఖ్యాయుధమని తేల్చాడు. ఈ కథలోని ఎక్స్ట్రా వేలాయుధం తన ఎక్స్ట్రా బతుకును, తనకు జరుగుతున్న అన్యాయాన్ని దుర్భర పరిస్థితుల్ని, పరిసరాల్ని మరచిపోయి వనజ అనే పెద్దసినిమా తారను ప్రేమించేశాడు– (మనస్సులోనే సుమా!) కథలో సమస్య యేమిటంటే వనజ పెళ్ళవుతోంది. (వేలాయుధంతోగాదు) కాని వేలాయుధం వనజకో పెద్ద విలువైన ప్రజంట్ యివ్వదల్చుకున్నాడు. ఎలా? తంగం అనే మరో ఎక్స్ట్రా వేలాయుధాన్ని ప్రేమించింది. వేలాయుధం ఆమెను ప్రేమించలేదు. ఓ రాత్రి తంగం యింటికెళ్ళి. ఆవిడ నగ నొకదాన్ని దొంగిలించి, వనజకు ప్రజంట్ యిచ్చి మద్రాసునుంచి పారిపోయి యేదో ఊళ్ళో రైల్వే స్టేషన్లో అడుక్కు తినే వాడుగా మారుతాడు వేలాయుధం–ఈ కథ చదివిన వాడికి వేలాయుధంమీద జాలి కలగకపోతే వాడికి హృదయం లేదన్నమాట!

'పూర్ణాహుతి' అన్న కథలో ఇతివృత్తం చాలా క్రొత్తగా ఉంది. 'పూర్ణాహుతి జరిగేటప్పుడు శనిదానాలు, మృత్యుంజయదానాలు మొదలైన క్షుద్ర

దానాలు పట్టటానికి కొందరు దిక్కుమాలిన బ్రాహ్మలు కావాలి. పూర్ణాహుతి జరిగే యిళ్ళకు అలాంటి దిక్కుమాలిన బ్రాహ్మణుల్ని పట్టుకొని తీసుకుపోవటంలో పేరిశాస్త్రిలాంటి వాళ్ళు కొంత గూడుపుఠాణీ జరుపుతుంటారు. తన చెప్పుచేతల్లో పడుండే వాళ్ళనే ఆ దానాలు పట్టటానికి తీసుకెడ్తుంటాడు పేరిశాస్త్రి-ఈ కథ చాలా వరకు చక్కగాసాగింది. కాని చివర్లో ఈ కథ చెబుతున్న దిక్కులేని బ్రాహ్మడికి జబ్బు చేయటం, అతనికి పోటీగా పేరిశాస్త్రి పిలుపుమీద వచ్చి దానం పట్టిన రామేశం వచ్చి సేవచెయ్యటం, రామేశంమీద ద్వేషం పెంచుకున్న ఆ బ్రాహ్మడు తను పొరపాటు చేశానని బాధ పడటం. చివర్లో రామేశం కారుకిందపడి చని పోవటం—ఈ సినిమాటిక్ సంఘటనలు ఆదిలో కథలో ఉన్న చక్కని వాస్తవికతను పాడుచేశాయి. కథ చివర్లో రామేశాన్ని ఎందుకు చంపినట్లు ? చివర్లో ఎవర్నో ఒకర్ని చంపకపోతే సుబ్బరామయ్యకు తృప్తి ఉండదా ?

'విడినమబ్బు' చాలా సెంటిమెంటల్‌గా సాగినకథ. పేదవాడు ధనవంతుల ముందు తానుగూడా బాగా డబ్బున్నవాడినేనని నటించబోవటం ఈ కథలో చిత్రించబడింది-'నిప్పు' అన్న కథలో వొక క్లిష్టమైన మానసిక సమస్య చిత్రించ బడింది. కాని రచయితకు ఫ్రాయిడ్ మొదలైన ఆధునిక మానసిక శాస్త్రవేత్తల రచనలతో సంబంధం ఉండిఉంటే ఈ కథ యింకా రక్తికట్టి ఉండేదనుకుంటాను.

ఈ సంపుటిలోకల్లా చాలా పేజీలు ఆక్రమించిన 'చేదుమాత్ర' అన్న కథలో చెప్పుకోదగిందేమీలేదు. రెండు మూడు పేజీలు చదవగానే శ్రీహరిరావు చివర్లో చేదుమాత్ర మింగుతాడని, చీవాట్లు తిని బాధ పడ్తాడని ఊహించవచ్చు. 36 యేళ్ళ వయస్సులో శ్రీహరిరావు ఉద్యోగంలో ప్రమోషన్ వస్తుందన్న ఆశతో మెట్రిక్యులేషన్ పరీక్షలో కూర్చొని లెక్కల పరీక్షరోజు రవి అన్న కుర్రాడి ఆన్సర్ బుక్ నుంచి కాపీ చెయ్యబోయి వాచర్‌చేత చీవాట్లు తిని పరీక్ష మానుకొని చక్కాబోతాడు. (ఆ రవి ఎవరోకాదు-వొకప్పుడు తను ప్రేమించిన వైదేహి కొడుకు !) చాలా naive గా సాగిన కథ చేదుమాత్ర-

'గాలి' అన్న కథ పూర్వం సుబ్బరామయ్య రాసిన 'నీళ్ళు' అన్న కథను జ్ఞాపకం చేస్తుంది. నీళ్ళు రాసిన ఐడియాతోనే ఈ కథను రాశాడనిపిస్తుంది-కమల తండ్రి జబ్బుతో బాధపడ్తుంటాడు- ఆమెకున్న యేకైక ఆధారం ఆమె అన్నయ్య. ఎక్కడో దూరప్రదేశంలో యేదో ఫ్యాక్టరీలో పనిచేస్తూ యేదో యాక్సిడెంట్‌లో చనిపోయాడు-అన్నయ్య చనిపోయాడని తండ్రితో చెప్పలేకపోయింది-తండ్రి

ఉన్న గదిలోకి గాలి రావటంలేదు. ఓ ఫ్యాను తెచ్చిపెడ్తే బావుండును అను కుంటుంది కమల. తాము ఉంటున్న ఇంటి యజమాని ప్రభాకరంతో కొంచెం సరసం సాగించి అతని దగ్గరనుంచి ఓ ఫ్యాను తీసుకురాగల్గుతుంది. కాని అప్పటికే కమల తండ్రి చచ్చిపోయాడు. (గాలి లేకపోవటం వల్ల నేనా ?)

"ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసమూహములు" అన్న కథకు ఆ పేరు పెట్టటంలోని ఉద్దేశ్యమేమిటో అర్థంకాదు. ఓ మధ్య తరగతి కుటుంబీకుడు సినిమాలో, హీరో హీరోయిన్‌తో 'నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో తెలుసా ?' అని పదేపదే అనటం విని, తను తన భార్యతో ఒక్కసారన్నా అలా అనలేదే అని ఆశ్చర్యపడి, ఇవ్వాళ్ళ అలా అందామని నిర్ణయించుకొని ఇంటికెళ్ళి "నిన్ను నేను ఎంతగా ప్రేమిస్తున్నానో తెలుసా ! సావిత్రీ !" అంటుండగానే ఆ సావిత్రి తన భర్త మాటల్ని వినిపించుకోకుండానే తనకు త్వరలోనే మరో కాన్పు రాబోతున్నదని తెలియ జేస్తుంది. సినిమా జీవితానికి వాస్తవ జీవితానికి ఉండే వ్యత్యాసాన్ని వ్యంగ్యంగా చిత్రించటానికి ప్రయత్నించాడు ఈ కథలో రచయిత. ఈ కథకు అంత గొప్ప చరణాల్ని పేరుగా పెట్టి వాటి భావస్ఫోరకతని పాడుచేయటం సుబ్బరామయ్యకు న్యాయం కాదని మనవి చేస్తున్నాను.

కేవలం కథకోసం కథ, సెంటిమెంట్‌కోసం సెంటిమెంట్ కాకుండా తను రాస్తున్న కథలకొక స్పష్టమైన సాంఘిక ప్రయోజనాన్ని నిర్దేశించుకొని సుబ్బ రామయ్య కథలు రాస్తే బావుంటుంది. 'అంగారతల్పం' లాంటి మంచి కథలు రాసిన సుబ్బరామయ్యలో అప్పటికి ఇప్పటికి ఎదుగుదల కనిపించకపోగా తరుగుదల కనిపిస్తోంది.

— మహేంద్ర

## అంపశయ్య

[ ప్రయోగాత్మక నవల. రచయిత: శ్రీ నవీన్. ప్రతులకు: నవీన్, 6-3-117, రామగిరి, నల్గొండ. 250 పేజీలు. వెల : 5-00.]

నవీన్‌గారి లేఖినినుండి వెలువడిన నవల అంపశయ్య. శిల్పంలో ప్రయోగాత్మకమైనది. వస్తువురీత్యాకూడా ప్రయోజనాత్మకమైనది.

శిల్ప వస్తువుల సమ్మేళనాన్నీ సమైక్యతనూ సాధించడానికి ప్రయత్నించిన ఈ నవల సమకాలీన జీవితాన్ని, దానిలోని వివిధ శక్తులనూ, వాని పరస్పర సంఘర్షణలనూ చాల చక్కగానూ వాస్తవికంగానూ ప్రతిబింబించిది.

సమకాలీన జీవిత చిత్రణతోనే రచయిత తృప్తిపడలేదు. దానికొక గమ్యాన్నీ ధ్యేయాన్నికూడా చూపించాడు. ఆ గమ్యాన్నందుకోవడానికి వ్యక్తులూ, వ్యక్తుల సమూహాలూచేసిన, చేయాల్సిన ప్రయత్నాలు, వాటివల్ల ఉత్పన్నమయ్యే దుష్ఫలితాలు, సత్ఫలితాలను గురించికూడా రచయితకొక విస్పష్టమైన దృక్పథం ఉన్నట్లుగాకూడా మనం అర్థం చేసుకోగలుగుతాము.

ప్రతి రచయితకూ యేదో ఒక దృక్పథం ఉంటుంది. ఆ దృక్పథం వెనుక ఒక తాత్విక అవగాహనకూడా తప్పని సరిగా ఉంటుంది. కాని నవీన్‌గారి దృక్పథం కొల్లలుకొల్లలుగా సృష్టి అవుతున్న నేటి నవలా సాహిత్యంలోగల దృక్పథాలకూ అవగాహనలకూ పూర్తిగా భిన్నమైనది. సామాజిక వాస్తవాన్ని చిత్రించే అనుభవం లేకనో, ఒకవేళ అనుభవం ఉన్నా చిత్రించే ధైర్యంలేకనో, రచయితలు వ్యక్తి వాదాన్నాశ్రయిస్తున్నారు. కావాలనే సమాజాన్ని, సమాజ వాస్తవికతా చిత్రణను వదిలేసి కేవలం సెంటిమెంటల్ సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. మార్కెట్ కోసమని దాన్ని వంటచేసే వాళ్ళ కోసమని విస్మరణ వాద సాహిత్యాన్ని తయారు చేస్తున్నారు.

ఇలాంటి వాతావరణంలో సామాజిక వాస్తవికతకూ దాని చిత్రణకూ ప్రాధాన్యానిచ్చి, ఆ చిత్రణలో రచయిత స్థానం పీడితులు, తాడితులులోనే తప్ప తదన్యం కాదన్న విషయాన్ని ధైర్యంగా చాటి చెప్పడం సాహసమే అనాలి.

అలాంటి సాహసాన్ని ప్రదర్శించిన ఉన్నవ వారి 'మాలపల్లి', బొల్లిముంత శివరామకృష్ణగారి 'మృత్యుంజయులు', ఆళ్వారుస్వామిగారి 'ప్రజల మనిషి' మొదలైన నవలల శ్రేణిలో ఈ నవలను చేర్చవచ్చును.

స్వాతంత్ర్యానంతర కాలంలో విద్యార్థుల జీవితాన్ని, వాళ్ళ సమస్యలనూ ఈ నవల చక్కగా చిత్రించింది. అందులోనూ పోస్టుగ్రాడ్యుయేట్సు జీవితం ఎలాంటి 'అంపశయ్య'నో కళ్ళకు కట్టినట్లుగా చూపుతుంది. ఎం. ఏ. విద్యార్థులంటే మైనారిటీ వెళ్ళిన యువకులు. వాళ్ళ సమస్యలు సమాజ జీవితంలో ఒక భాగం. ఏ ఆశలు ఆశయాలతో వాళ్ల యూనివర్సిటీల్లోకి ఆ తర్వాత జీవిత ప్రాంగణంలోకీ అడుగుపెట్టేదీ, ఆ అడుగు వేసీ వేయడంతోనే వాళ్ళ తలలు బొప్పిగట్టే అనుభవాలకూ ఈ నవల ఒక పుట్టలాంటిది, గనిలాంటిది.

విద్యార్థి దశ ముగిసిన తర్వాత జీవితానికన్నా విద్యార్థి జీవితాన్నే ప్రధానంగా చిత్రించిన ఈ నవలను ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరమైన హైదరాబాద్ మరియు ఉస్మానియా యూనివర్సిటీ వాతావరణాలే రంగస్థలాలు. రవిచేత అనిపించిన ఈ క్రింది స్వగతంలో పేదవిద్యార్థి జీవితవాస్తవాన్ని ఎంతో చక్కగాను సమగ్రంగాను చిత్రించారు.

"మెస్‌బిల్ కట్టడం యెలా? హాల్ టికెట్ తీసుకోవడమెలా? పరీక్ష కెళ్ళడమెలా? పరీక్షలకు చదవడంయెలా? అన్నీ ప్రశ్నలే, అన్నీ ప్రశ్నలే. సమాధానాలులేవు. అసలు వీటన్నిటికంటే ముఖ్యం శ్రీశైలంగాడి బారినుండి తప్పుకోవడం యెలా? వాడు యెప్పుడో యెక్కడో తన తల పగులగొడ్తాడు. ప్రాణాలు తీస్తాడు.

"మెస్‌బిల్ కట్టడం, హాల్ టికెట్ తీసుకోవడం, పరీక్షలకు చదవలేక ఊరుకోలేక యమయాతన అనుభవించడం, క్లాసు తెచ్చుకోవడానికి ప్రొఫెసర్ల కాళ్ళ దగ్గరి కెళ్ళడం, తర్వాత ఉద్యోగం, రికమెండేషన్లు, మినిస్టర్ల చుట్టూ తిరగటం, చివరకు ఎల్. డి. సీ. చేస్తూ జీవితమంతా జీవచ్ఛవంలా బతకటం."

ఇవి డబ్బుల్లేని పేదవిద్యార్థుల అవస్థలైతే, రమేశ్, కిరణ్మయి స్టూడెంట్స్ యూనియన్ సెక్రెటరీలాంటి వాళ్ళకు అమెరికా వెళ్ళాలన్న పిచ్చి, దానికోసంపడే పాట్లనుకూడా నవల స్పృశిస్తుంది.

యూనివర్సిటీ వాతావరణంలోని కృత్రిమత్వాన్ని, కొందరు విద్యార్థులు తమ పేదరికాన్ని కప్పిపుచ్చుకోవడానికి వేసే పోజులూ పడే బాధలూ కళ్ళకు కట్టినట్లుగా చిత్రించారు.

ఆదర్శప్రాయుడైన లెక్చరర్ ఉపేంద్రబాబు నిజాయితీ వాస్తవజీవితంలో తన ఆదర్శాలకు తానే ఎదురు తిరగవలసి వచ్చిన వైరుధ్యం, ప్రొఫెసర్లకు కాకాబట్టని కారణాన క్లాసు తెచ్చుకోలేక పోవడం, వాళ్ళలో వాళ్ళకుండే స్పర్థలు విద్యార్థుల జీవితాల నెలా నాశనం చేసేదీ L. D. C. ఆనందరావులోని నిరాశా నిస్పృహలు నవల మనకు సుబోధకం చేస్తుంది.

క్లాసులు బోరింగుగావుండే బోధనా పద్ధతీ, ప్రొఫెసర్లకు, లెక్చరర్లకున్న తీరుబడిలేని రాజకీయలవల్ల కోర్సు పూర్తి కాకపోవడం, వీటన్నిటితో బోరెత్తిన విద్యార్థులు సినిమాలు, చౌకబారు నవలలు సెక్సు పుస్తకాల ప్రసంగాల పాలు గావడమో, లేక పరీక్షల్లో మార్కులకు తిరుపతి వేంకటేశ్వరుడి శరణు వేడు కోవడాలు మొదలైన అనారోగ్య వాతావరణాన్నికూడా నవల చిత్రించింది.

నవలలోని ప్రతిపాత్ర తన పరిసరాలతో పోరాడి నిలదొక్కుకోవడానికి ప్రయత్నిస్తుంది. రవి తండ్రి వ్యవసాయం చేసుకోవాలన్నా పంచాయితీ రాజ్యం, ఈ రాజ్యం నాయకుల ఆశ్రితపక్షపాతం, అవినీతి అడ్డం వొస్తుంది.

పచ్చివ్యభిచారిగా మారిన 'రత్తి'కూడా మొదట తన శీలాన్ని కాపాడు కోవడానికి ప్రయత్నిస్తుంది, ప్రతిఘటిస్తుంది. చివరకు రౌడీ గ్యాంగు సాయంతో గ్రామపంచాయితీని పరిపాలిస్తున్న ఛోటానాయకుడు గోవిందరావుకు లొంగిపోవాల్సి వస్తుంది. జీవిత సంగ్రామంలో ఓడిపోయిన రత్తి అదే సమాజంపై పగ దీర్చు కోవడానికి పచ్చి వ్యభిచారిగా మారుతుంది. చివరకు అవే దుష్టశక్తులు ఆమె ఆత్మ హత్యకు దారి తీస్తాయి.

సాంఘికదృష్టి గలిగిన రచయిత అభ్యుదయ భావుకుడు. కనుక వియత్నాం గెరిల్లా పోరాటంనుండి విలేజిపాలిటిక్సుదాకా వాటిప్రభావాలను సందర్భాను సారంగా యెత్తిచూపించాడు. సామాజిక వాస్తవికతకు అద్దంపట్టి చూపడంలో యువతరంలో ఉన్న మంచిచెడుగులను సామూహిక కార్యాచరణ వాళ్ళనెలా ప్రభావితంచేసేది చూపించారు. సామాజికదుర్నీతిని ఉవ్వెత్తుగా కదలిన సామూహిక శక్తుల్లో భాగస్వాములైనవ్యక్తులే యెదిరించగలరన్న వాస్తవాన్ని నిరూపించాడు రచయిత.

బ్రహ్మాండమైన భవనాలు, రాచవారివిడుదుల్లాంటి హాస్టళ్లు స్వేచ్ఛగా నిశ్చింతగా తిరిగే యెక్కుబెట్టినమీసాలు, వైట్‌ప్యాంట్లు, నల్ల కళ్ళద్దాల విద్యార్థులతోను విద్యావిజ్ఞానాలకే జీవితాలనర్పించినట్లు కనపడే ప్రొఫెసర్లు, లెక్చరర్లతోను నిండివున్నట్లుగా బాహ్యదృష్టికి కనిపిస్తుంది. కాని ఈ బైటి బటారంతోబాటు లోపలి లొటారాన్నికూడా బాగా బహిర్గతం చేసిందీ నవల.

ఈ నవలలో నాయకుడు రవి, అతని మిత్రుడు వేణు మధ్యతరగతిరైతు కుటుంబం నుండి వచ్చినవాళ్లు. పల్లెటూరు జీవితం పూర్వరంగంగా వున్న వీళ్ళకు అప్పోసప్పోచేసి నానాబాధలూపడి తలిదండ్రులు తమను చదివిస్తున్నారన్న చైతన్యం వీళ్లకు నరనరాల్లోనూ ఉంది. బాగాచదువుకోవాలనుకుంటారు, కాని యూనివర్సిటీ వాతావరణం వాళ్ళనలా చేయనివ్వదు. ఈ పరిస్థితులతో ఘర్షణ పడుతున్న వీళ్ళకు నెహ్రూగారన్నా సోషలిజమన్నా వల్లమాలిన అభిమానం. పరీక్షలో బెదిసికొడ్తుందన్నాకూడా 'మార్క్స్' (Marx) మీదకూడ అభిమానం పెంచుకున్నారు.

కాపీ చేస్తుంటే చూచిన లెక్చరర్‌పైన మీసాలు యెక్కుపెట్టి వురిమి చూసి టేబిల్‌మీద కత్తిగుచ్చి గడగడలాడించగల్గిన గోపాలరావు అతనిమిత్రులు ఆడపిల్లలను అల్లరిపట్టిస్తుంటే, బూతులువల్లిస్తుంటే తన శరీరాన్ని ముళ్ళతో గుచ్చినట్లుగానూ. తనస్నేహితుడామాట లన్నందుకు తనేయేదో తప్పుచేసినట్లుగానూ బాధపడే సంస్కారం రవిది. ఈలాంటి రవి పాత్ర, జీవితాన్ని నడిపేది కేవలం సెక్సు అన్నఫ్రాయిడ్ సిద్ధాంతంకాదు. తనలోని లైంగిక అశాంతి సర్వ ఆందోళనలకూ మూలమనుకొని దాన్ని సంతృప్తి పరచుకుందామనుకునే వ్యక్తి వాదపు బురదలోకి దిగలేదు. అలాంటి అపసవ్యపు ధోరణులకు బదులు కిరణ్మయిపై తనప్రేమను Sublimate చేసుకున్నాడు. అలాగే రత్తిపై ప్రేమ కూడా Sublimate అయి రత్తిలాంటి వాళ్ళపై సానుభూతీ వాళ్ళనైతిక పతనానికి కారణమైన పల్లెపట్లలో ఛోటా నాయకులైన గోవిందరావులపై అసహ్యాన్ని పెంచుకున్నాడు.

తాను చదివే ఎం. ఏ. చదువు డాక్టర్‌కోర్సు, ఇంజినీరింగ్‌కోర్సు కాదనీ మహా అయితే బడిపంతులు పనిదొరుకుతుందనీ, కలెక్టర్, తాసీల్దార్, పోలీసుఅమీన్‌వంటి పెద్ద పదవులు పెద్ద ఉద్యోగాలు-ప్రతిరోజు వందలకి వందల రూపాయలు ఎవడుపడితేవాడు తెచ్చి కాళ్లమీద పోస్తాడు అనుకున్న

రవినాన్న "అలాంటి ఉద్యోగమా ఈ మొహానికి, యే బడి పంతులో అవుతాడు చివరకు" అంటాడు. తండ్రీకొడుకులమధ్య రక్తంపంచుకొని పుట్టిన జీవిగా తనకేమీ స్థానంలేదనీ, డబ్బు సంపాదించి అతనికియిచ్చే ఆర్థిక సంబంధాన్ని (Cash nexus) గానే అర్థంచేసుకున్నాడు. కాని అతని అమ్మ అలాంటిది కాదు. ప్రేమమూర్తి. అమృతంలాంటి హృదయం గలది. వేయబోయే ప్రతి తప్పుడడుగులోనూ అమ్మ యొక్క మధురమైనస్మృతి రవిని సన్మార్గానికి మళ్ళిస్తూ ఉంటుంది.

రంగారెడ్డి, శ్రీశైలం నవలలోని ప్రతి నాయకులు. వీళ్ళు సోషలిజంలాంటి భావాలు దేశాన్ని పాడుచేస్తున్నాయనీ, నెహ్రూ లాంటి వాళ్ళను ఉరితీసి ఇండోనేషియా సుహర్తోలాంటి వాళ్ళ మిలిటరీ పరిపాలన యేర్పాటు చేయాలన్న భావధోరణిగలవాళ్లు. విచ్చలవిడిగా డబ్బు వెచ్చించి దాని ప్రభావంతో కొందరు యువకులను కూడగట్టి మొత్తం యూనివర్సిటీనే తమ చెప్పుచేతల్లో ఉంచుకోగల సమర్థులు. వాళ్లమాటకెదురులేదు. రవి వేణులాంటి వాళ్ళను డబ్బిచ్చి కొనేయడమో, అలా సాధ్యంగాకుంటే తన్ని లొంగదీసుకోవడమో వీళ్ళకున్న వ్యూహం. ఈ యెత్తుగడలతో యూనివర్సిటీలో మకుటంలేని మహారాజులుగా చెలామణీ అవుతున్నారు. వీరికి లొంగని రవి వేణులకీ వీరికీ మధ్య చిన్న వాగ్వాదం సాగర్ ఉన్న హాస్టల్‌రూంలో జరిగింది. అపాలజీ డిమాండు చేశారు. లేకపోతే హాస్టల్లో క్షేమంగా బ్రతకలేరని బెదిరించారు.

క్షమాపణ కోరుకోవాల్సిన అవసరంలేదని మధ్యస్తులుగాఉండే, పరీక్ష ఫలితాలకు తిరుపతివెళ్ళి గుండుగొట్టించుకొచ్చిన నిధి, సాగర్, ఆచారి, గుర్నాథం, ప్రకాశ్, గోవిందరెడ్డి వగైరాలు నిర్ణయించారు. ఎక్కుమీసాలు, టెరిలీన్ టైట్‌పాంటు, పాయింటెడ్ షూస్‌తో జేబులోకత్తిఉండే గోపాలారావు వగైరాలు కూడా వీళ్లతో కలిశారు. గిల్లికజ్జాలు పెట్టుకోదలచిన శ్రీశైలం, రంగారెడ్డి గ్రూపు క్యాంటీన్‌లో సంఘర్షణను రెచ్చగొట్టింది. ఆ సంఘర్షణలో తిరోగమనం పట్టింది శ్రీశైలం ముఠా. వ్యక్తులుగా అభ్యుదయ భావాల నంటిపెట్టుకుంటే సరిపోతుందనుకున్న రవి, వేణు పాత్రలు సమూహంగా కార్యాచరణకు దిగకపోతే అభ్యుదయభావాలు అణగారి పోతాయన్న నిర్ణయానికొస్తారు. వ్యష్టికన్న సమిష్టిశక్తిమిన్న అన్న ఈ భావపరిణామమే రవి పాత్ర యొక్క జీవిత పరిణామం.

ఈ జీవితపరిణామమంతా 16 గంటలలో ఇమిడ్చాలని చైతన్య స్రవంతి శిల్పాన్నాశ్రయించిన ప్రయత్నం ఈ నవల. ఈ పరిణామం సాధ్యమా అన్నదే ప్రశ్న. ఈ పరిణామం వెనక కొన్ని సంవత్సరాల సామాజిక సంఘర్షణలూ. మనఃప్రవృత్తులూ వాటిగాథలూ పరిణామాలూ వాటి పరస్పర ప్రతిక్రియలన్నీ ఇమిడివుంటాయి. ఈ విషయం నవీన్‌గారు అర్థంచేసుకోలేదని కూడా చెప్ప వీలులేదు. కాని ఆయన అవలంబించిన శిల్ప విశేష మలాంటిది. అందుకే flash back పద్ధతి నవలంబించి ఆ లోటు భర్తీచేయాల్సి వచ్చింది. దీనిలో కొంత తికమక లేకపోలేదు. దీనికి ప్రధానంగా రచయిత యెన్నుకున్న వస్తువుకూ శిల్పానికీ వున్న వైరుధ్యమే ప్రబలమైన కారణం. ఈ సందర్భంలో రచయిత తన ఉపోద్ఘాతంలో "నేను తీసుకున్న వస్తువే నాకు చైతన్య స్రవంతి శిల్పాన్ని చూపించింది" అన్నమాటలతో ఏకీభావం సాధ్యంకాదు. జేమ్సు జాయిస్ చైతన్యస్రవంతి శిల్పంలో రాసిన "యులీసిస్" నవల ఇంగ్లీషులో రాసినా అది ఇంగ్లీషు వచ్చిన వారికి కూడా లాటిన్ అండ్ గ్రీకు లాగానే తోస్తుంది. ఏమీ అర్థంకాదు. దానికి గిల్బర్టు రాసిన గైడును పక్కన పెట్టుకొని రెండు మూడు నెలలు అవస్థపడితేనేగాని కొంచెం అర్థం అయినట్లనిపించలేదట. ఈ శిల్పాన్ని ఉపయోగించి రాసిన నవలలు సామాన్య పాఠకులకు కొరుకుడు పడలేదు. కావుననే సామాన్య పాఠకులకు ఈ నవల కేవలం సర్కస్ ఫీట్సుగా తయారై, వారి ఆదరణకు నోచుకోలేదు. తెలుగు సాహిత్యంలో ప్రబంధ యుగంయొక్క క్షీణదశలోని గర్భశ్లేష కవిత్వాలూ, ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యాల్లాగే ఇవి తయారైనాయన్నమాట. చారిత్రకంగా చూస్తే ఈ శిల్పం మొదటి ప్రపంచ సంగ్రామానంతరం యూరోపులో పారిశ్రామికయుగ పతనానికి దాని కోలుకోలేని సంక్షోభదశలో ప్రచలితమైంది. ఈ శిల్పం సర్రియలిజంలోని భాగమే.

ఫ్రాయిడ్ సైకోఎనాలిసిస్ దీనికి పునాది. ఫ్రాయిడ్ మనస్తత్వ విశ్లేషణం చాలా ప్రతిభావంతమైనదైనాకూడా, సమాజంతో సంబంధంలేని పరిశీలన కావడంవల్ల వ్యక్తివాదానికి దారితీసింది. జాగ్రత్ చైతన్యానికన్న సుప్త చైతన్యంపై నిరంకుశాధికారం చలాయిస్తూ సహజాతాల (Instincts) వికసనను అరికడ్తుందనీ, అందువల్ల మనస్సులను విముక్తం చేయాలన్నదే ఈ టెక్నిక్‌కు లక్ష్యం.

ఫ్రాయిడ్ సుప్తచైతన్యాన్ని సర్వశక్తిసమన్వితమని నిరూపించడానికి ప్రయత్నించాడు. అన్నిటికీ చోదకశక్తి సెక్సు అనికూడా నిరూపించడానికి

ప్రయత్నించాడు. జాగ్రత్ చైతన్యం సుప్త చైతన్యం పరస్పర సంబంధంలేని చీకటికొట్లుకావు. హేతువాదంతోకూడిన స్వీయమానసిక చైతన్యం సామాజికానుభవం అనే గీటురాయిపై పరీక్షించబడి నిగ్గుదేలుతుంది. ఈ విధంగా 'వాస్తవికత'కు ఆచరణే గీటురాయి. జాగ్రత్చైతన్యం సుప్తచైతన్యాన్ని, సుప్తచైతన్యం జాగ్రత్చైతన్యాన్ని ప్రభావితం చేస్తుంటాయి. ఈ రెంటిపైనా సమాజం తన ప్రభావాన్ని ప్రసరింపజేస్తూనే ఉంటుంది. భావనాప్రక్రియను సామాజిక వాస్తవికతలో భాగమైన జాగ్రత్చైతన్యం పాలిస్తూ ఉంటుంది. ఇదే మానవుని జ్ఞానసంచయంలోనూ సంపుటీకరణంలోనూ ప్రధానభాగం. జాగ్రత్ చైతన్యం సమాజ సంస్కృతిలో ఒక భాగమేకాక సామాజికానుభవమన్న వాస్తవాన్ని విస్మరించాడని ఫ్రాయిడ్ను కాడ్వెల్లాంటివారు విమర్శించారు. అధివాస్తవిక రచయిత, రాజకీయ పదజాలంలో చెప్పాలంటే, బూర్జువా విప్లవవాది. అతని పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్యాలూ శాశ్వత సంక్షోభాలూచూచి, రోసి, వాటిని నాశనం చేయాలనుకుంటాడు. కాని ప్రత్యామ్నాయ మార్గాన్నీ, ఆ మార్గంకోసం సమాజాన్ని తయారుచేసుకోవాలని విశ్వసించక బూర్జువా సమాజ పరిధిలోనే ఆలోచించి దారికానక నిరాశ నిస్పృహలకు లోనౌతాడు. ఈ విధంగా సామాజిక సంబంధాలమీద అదుపును కోల్పోతాడు. ఆ నిరాశా నిస్పృహల ప్రతిబింబమే సాహిత్యంలోని సర్రియలిజం ఈ చైతన్య స్రవంతి శిల్పం. తరచి చూస్తే ఇదే చివరకు కళ కళకోసమేనన్న వాదానికి ముద్దుబిడ్డగా తయారౌతుంది.

చైతన్య స్రవంతి శిల్పస్వరూపానికీ, సాంఘిక విప్లవ దృష్టిగల రచయిత భావాలకూ, ఆ భావాలతో కూడిన వస్తువుకూ వైరుధ్య మేర్పడింది. దాని ఫలితమే చైతన్యస్రవంతి శిల్పాన్ని మార్చుకొని సామాన్య పాఠకుడికి అర్థమయ్యేలా రాయాల్సి వచ్చింది. స్వానుభవమే రచయితను తీర్చి దిద్దింది. లేకపోతే కొన్ని సైకలాజికల్ సంకేతాలు ఆధారంగా గల సర్రియలిస్టు నవల తయారయ్యేది. ఆ సంకేతాలను విప్పిచెప్పి వ్యాఖ్యానించడానికి గైడ్సు, రచయితలు, అవసరమయ్యేవారు. కాని అలాంటి ప్రమాదం యేమీ జరుగలేదు. సుబోధమైన నవల తయారైంది.

చైతన్యస్రవంతి శిల్పంమీది ఆసక్తి నవలకు కొంత నష్టం కలిగించిందన్న విషయాన్ని గమనించకుండా ఉండలేము. నవలలో రవి పాత్ర అంత సజీవంగా మిగిలిన పాత్రల చిత్రణ జరుగలేదు. రవి స్నేహితుడు, భావసా

రూప్యం కలిగిన వేణుపాత్ర చాలా యాంత్రికంగా కదులుతున్నట్లనిపిస్తుంది. ఆ పాత్ర అంత సజీవంగా చిత్రింపబడలేదు. అదేవిధంగా తక్కిన పాత్రలుకూడాను. దీనికి స్వగతాలు, స్వప్నాలతో నిండిన శిల్పమే కారణం.

పారిశ్రామిక యుగంలో వికసించిన నవజీవితాన్ని విశాలంగానూ విరివిగానూ చిత్రించడానికి అవకాశమున్న ప్రక్రియ–సాంఘిక వాతావరణాన్నీ, పాత్రలనూ, వాటి మనోప్రవృత్తులనూ పరిణామాలనూ వివిధ ఘటనా పరంపరల వరుసలో చిత్రించడానికి వుపయోగపడుతుంది. వీటన్నిటి పొందికలోనే ఒక లయ వచ్చేస్తుంది. కాని ఈ నవలలో రచయిత తనమీద తాను విధించుకున్న నిర్బంధాల కారణంగా ఈ కర్తవ్యాన్ని నెరవేర్చలేకపోయాడు. ఒక విద్యార్థి జీవితంలోని 16 గంటల జీవితాన్నే 246 పేజీలకు పెంచగలిగిన రచయిత సామర్థ్యం మామూలు నవలగా దీన్ని రాస్తే ఇంకా పరిపుష్టిని పొందేదేమోననీ ఇంకా సజీవమైన నవలగా తయారయ్యేదనీ ఆశించడం అత్యాశ కాదేమో! స్వాతంత్ర్యానంతరం విద్యార్థి జీవితాన్నీ ఉపాధ్యాయుల జీవితాన్నీ కళాత్మకంగా చిత్రించిన నవలగా తయారయ్యేది. అభ్యుదయ నిరోధకమూ కాలం తీరిపోయిన రూపశిల్పంలో అభ్యుదయ వస్తువును యిముడ్చడంలో కొన్ని ఇబ్బందులున్నాయి. అవే రచయిత కెదురైనాయి. ఉదాహరణకు కాలం తీరిపోయిన యక్షగాన ప్రక్రియలో సీరియస్ వస్తువును ఇముడించడం సాధ్యంకాదు. రసాభాసమవుతుంది. అందుకే యక్షగాన ప్రక్రియ అధిక్షేపాలకూ అవహేళనలకూ నేడు పనికి వస్తున్నది. శిల్పానికీ దాని చరిత్ర పరిణామానికీ అవినాభావ సంబంధం ఉంటుంది. ఏ శిల్పరూపమైతే నేమిటి అని వస్తువును ఇరికించ ప్రయత్నిస్తే అది జయప్రదంకాదు, సరికదా బెడిసికొడ్తుంది. ఇది గుర్తించాడు కనుకనే నవీన్‌గారు ఈ నవలలో సర్కస్ ఫీట్లు చేయలేదు. జేమ్సుజాయిస్‌లాగాని మరెవరిలాగాని రాయడానికి ప్రయత్నించలేదు. ఇది పూర్తిగా వారి స్వతంత్ర రచన. It is his own sweat and blood. ఇలా స్వతంత్ర మార్గాన్ని అవలంబించి ప్రయోగం చేసి స్వతంత్ర మార్గాన్నెన్నుకున్నందుకు రచయితను అభినందించాల్సిందే. చైతన్యస్రవంతి రూపాన్ని అవలంబించలేదన్న కొందరి విమర్శను ఒప్పుకుంటూనే ఈ లోపాన్నే గుణంగా భావించవచ్చునని నిస్సందేహంగా చెప్పవచ్చును.

సాహిత్యంయొక్క సాంఘిక ప్రయోజనాన్ని నవల ఉపోద్ఘాతంలో రచయిత యిలా వివరించాడు :

"సాహిత్యం, ముఖ్యంగా నవల, పాఠకుడిలో తనలోకి తాను చూచుకునే అంతర్దృష్టిని, జిజ్ఞాసను జాగృతంచేయాలి. సాహిత్యంద్వారా పాఠకుడు మొదలు తనేమిటో అర్థంచేసుకొని తన్నుతాను సంస్కరించుకొని ఉత్తమ మానవుడిగా రూపొందితే విశ్వశ్రేయస్సుకు పునాదులు వేసినవాడవుతాడు. ఇదే సాహిత్యం యొక్క ప్రయోజనమనుకుంటాను. ఈ నవలను నేను ఈ ప్రయోజనం కోసమే రాశాను."

ఈ నిర్వచనంలో వ్యక్తివాద ఛాయలున్నాయి. సాంఘిక దృష్టిగల్గిన రచయిత అంతర్ముఖుడు గావాలన్న విషయాన్ని నొక్కిచెపితే, అది ప్రపంచాన్నీ, సమాజాన్నీ వదలిపోయే వేదాంత ధోరణిగా మారే ప్రమాదం ఉంది. తన్నుతాను తెలుసుకోవాలన్న జిజ్ఞాస సమాజానికి సంబంధంలేకుండా సాగేదికాదు. అలా సాగించి అంతర్ముఖుడు కావాలనుకున్న చలం రమణాశ్రమానికి వెళ్లాడు. అరవిందుడు స్వాతంత్ర్య పోరాటరంగా న్నొదిలి తపస్సు చేసుకోవడానికి పాండిచేరి చేరుకున్నాడు.

మానవుడిలో అంతర్దృష్టి అంటేయేమిటి? తన్నుతాను తెలుసుకోవడ మంటే యేమిటి? తన్ను తాను తెలుసుకోవాలన్న మానవుడి మనస్సులో ప్రతిఫలించేది బాహ్యప్రపంచమే. అంటే తనచుట్టూఉన్న సమాజం; దాని లోని వివిధశక్తులు, వానిలోని వైరుధ్యాల పరిణామానికి దారితీసే చలనాలు అన్నమాట. మానవుణ్ణి తెలుసుకోవడానికి అతణ్ణి పరివేష్ఠించి ఉన్న సమాజాన్ని ఆ సమాజంలో అతనిపాత్రను అర్థంచేసుకోవాలి. కేవలం ఈ విధంగా అర్థంచేసుకోవడమే అభ్యుదయ భావుకుని ధ్యేయంకాదు. దాన్ని మార్చడానికి కూడా ప్రయత్నం చేయాలి. ఆధునిక శతాబ్దంలో మానవుణ్ణి నడిపేది ఏవో అజ్ఞాతశక్తులుకావు. అతని సామాజిక చైతన్యమే అతణ్ణి నడుపుతున్నది. సమాజమే అతని భావాలను నిర్ణయిస్తున్నది. కనుక స్వీయమానసిక ధోరణితో చేసిన ఈ నిర్వచనం నవలలో నిరూపింపబడలేదు. బాహ్యప్రపంచ వాస్తవికతతో సంబంధమున్న రవిపాత్ర అలా అంతర్ముఖంకాదు, కాలేదు. సామాజిక శక్తులతో కలసిపోవడానికి పోరాడటానికి ఉద్యుక్తమౌతుంది. సంఘంయొక్క సామూహిక శక్తిద్వారానే తనకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు దొరుకుతాయన్న విశ్వాసంతో ముందడుగువేస్తాడు రవి. రచయిత మాటల్లోనే చెప్పాలంటే క్యాంటీన్‌లోని సమష్టి ప్రతిఘటన తర్వాత రవి ఏకాకికాడు. తను జనసమూ

హంలో ఉన్నాడు. తనకోసం అందరూ, అందరికోసం తనూ పోరాడుతారు. తను ఒంటరివాడు కాడు. అందరూ తనలాంటివాళ్లే. అందరికీ యేవో సమస్యలు, తనలాగే యేవో కష్టాలు – అందరివీ తనలాంటిగాథలే, తనలాంటికన్నీళ్ళే. అందరిలో తననుతాను చూచుకోవడం యెంతహాయి అనుకుంటాడు. ఈ నిర్వచనం వ్యక్తివాద దృక్పథానికి బదులు స్వీయ బాహ్య పరిస్థితుల సమన్వయానికి దారితీసేది – శాస్త్రీయవిజ్ఞానంపై ఆధారపడిన ఆధునిక అభ్యుదయ భావనకు దారులు చూపేది.

నవలముగింపులో అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా అభివృద్ధి కాముకులు ఐక్యంగా సంఘటితపడాలనే సందేశం చాలా వాస్తవికమని నేటి సమాజంలోని యే ఘటనను పరిశీలించినా బోధపడక మానదు. ఇదేదో కొన్ని రాజకీయ పార్టీల నినాదమని కొట్టి పారవేయడానికి వీలులేదు. ఇలా కొట్టిపారవేసే మధ్యతరగతి పిరికి మనస్తత్వం చూపే ప్రత్యామ్నాయ మార్గం యేమీలేదు. తన్నుతాను సంస్కరించుకోవడం తన్నుతాను బాగుచేసుకోవడం పేరుతో అంతర్ముఖత్వం పాలైపోయే కర్మ సన్యాసమే తప్ప వేరే మార్గాన్ని చూపించలేదు. సమాజంలో రెండు భావధోరణులు ఒకదానితో ఒకటి సంఘర్షణ పడ్తున్నాయి. ఇది మన కళ్ళముందు జరిగేయదార్థం– ఇది లేదనుకొని గజంమిథ్య పలాయనం మిథ్య అనుకొనే వీలులేదు. ఈ ధోరణుల్లో ఒకటి మార్పును విప్లవాన్ని కోరే అభ్యుదయవాదం, రెండోది యథాతథవాదం. జరుగుతున్న యీ ఘర్షణలో సమాజంలోని ప్రతి వ్యక్తి యేదో ఒకవిధంగా ప్రభావితు డౌతున్నాడు. తటస్థంగా ఉంటా మనుకొన్నవాళ్లు కూడా చైతన్యరహితంగానో పరోక్షంగానో యథాతథవాదానికి మద్దతు నిస్తున్నారు. తటస్థులుగా ఉండేవాళ్లను తమతమ క్యాంపుల్లోకి లాక్కోవడానికి ప్రతిరంగంలోను ఘర్షణ సాగుతున్నది. చరిత్ర పురోగమనాన్ని త్వరితం చేస్తున్నది. ఇదే సామాజిక వాస్తవికత. బానిస సమాజం నుండి ఫ్యూడల్ సమాజం, ఫ్యూడల్ సమాజంనుండి పెట్టుబడిదారీ సమాజం, చివరకు పెట్టుబడిదారీ సమాజంనుండి సోషలిస్టు సమాజాలు పైన సూచించబడిన శక్తుల సమీకరణ ప్రతిఘటనలవల్లనే పరిణామాన్ని చెందాయి. సంఘటితశక్తులే సామాజిక మార్పులకు దారి తీశాయి, తీస్తున్నాయి. ఇదే చరిత్ర చెప్పే సత్యం, సూచించే కర్తవ్యం. ఈ సత్యాన్ని నవలలో ప్రతిబింబించడం రచయిత ధైర్యానికీ, నిర్భయతకీ చిహ్నం. ఈ సంఘర్షణ సమాజంలోనే ఉన్నది. యెక్కడి

నుంచో కృత్రిమంగా దిగుమతి చేసిందికాదు. బాహ్యసామాజిక వాస్తవికతలో రాజకీయ పార్టీలూ వాళ్ల పాలసీలూ వున్నాయి. విద్యార్థుల్లో తమ పాలసీల ప్రచారకులను తయారు చేసుకుంటున్నారు. విద్యార్థి యూనియన్ల యెన్నికలలో తమపార్టీ తమముఠా విజయాన్ని సాధించాలని డబ్బు వెదజల్లుతున్నారు. యూనివర్సిటీలను, హాస్టళ్లను తమ కేంద్రాలుగా చేసుకుంటున్నారు ఇదంతా అవాస్తవం యెలా అవుతుంది ? పల్లెటూళ్లలో పాలక వర్గాలు భూములు పెట్టు బడుల కేంద్రీకరణతో, డబ్బుబలంతో సామ్రాజ్యా లేర్పాటు చేసుకుంటున్నారు. మంత్రుల ముఠాలకు అండగా ఉండి దళులై పోయి ఎం.ఎల్.ఏలు, ఎం.పీలు, తర్వాత మంత్రులై రాజకీయ వ్యాపారంలో దళులై పోతున్నారు. ఇదంతా అబద్ధమా ?

సాంఘిక దృష్టిగలిగిన రచయిత వీటన్నిటినీ చూడకుండా యెలా కళ్లు మూసుకుని పడిఉంటాడు ? అలా పడిఉండలేడు గనుకనే నేటి వ్యవస్థ బండా రాన్ని బైటబెట్టాడు. తా జెడ్డకోతి వనమెల్ల చెరుస్తుందన్న సత్యాన్ని చాటి చెప్పాడు. ఇది గిట్టనివాళ్ళు చౌకబారు నినాదా లనడం యెప్పుడైనా ఉన్నదే! అంతకుమించి వాళ్ళు చెప్పగలిగిందేమీలేదు.

— 'కాంచనపల్లి'

పేదప్రజల పక్షాన నిలచిన

# తిరుగబడు కవులు

ఇది సమాజ పురోగమనాన్ని అడ్డుకొనే శక్తుల సింహాసనాల క్రింద డైన మైట్లు ప్రేలుతున్నకాలం. పాతసామాజిక శక్తులు గుండెలు పగిలి రక్తం కక్కు తుంటే– నూతనశక్తులు విప్లవజ్వాలల్ని విరజిమ్ముకుంటూ విజృంభిస్తున్నకాలం.

సమాజంలో దోపిడీగర్భం నుండే హింస పుట్టింది. అన్నికాలాల్లోనూ దోపిడీశక్తులు హింసను ఒక కళగా అభివృద్ధి పరిచాయి. దీనికి విరుగుడుగానే, దీని నుండే ప్రతిహింస పుట్టింది. హింసను ప్రతిఘటించే క్రమంలో, అది అభివృద్ధి చెందుతూ వచ్చింది.

విశాలజనంపై హింసను రుద్దే అల్పసంఖ్యాకులను, 'అహింసామూర్తులు'గా, వారిని ప్రతిఘటించే ప్రజలను 'హింసావాదులు'గా కొందరు చిత్రించడం - అదే సందర్భంలో ప్రజల ప్రతిఘటనను విప్లవపంథాగా, వారిపై సాగే దాడిని విప్లవప్రతీఘాతక చర్యగా గుర్తించడం చరిత్ర పుటల్నిండా కనిపిస్తుంది.

ఈ రెండూ భిన్నదృక్పథాలుగా వుండడం, వీటిమధ్య నిర్విరామంగా ఘర్షణ సాగడం, అంతిమంగా ప్రజలపక్షం నెగ్గడం చూస్తాం.

మనదేశంలో, కొన్నిప్రాంతాల ప్రజలు చేబడ్తున్న విప్లవమార్గాన్ని సమర్థించడానికి సాహితీరంగంలో కొన్ని శక్తులు మనరాష్ట్రంలో గొంతువిచ్చుతున్నాయి. జనంలో జ్వలిస్తున్న వీరత్వాన్ని కీర్తించి, వారి విప్లవపంథాకు నైతికపుష్టినిచ్చి ప్రోత్తేజపరచడానికి ఈ శక్తులు తమ సృజనాత్మక సాధనాలను సంధిస్తున్నాయి. దీని వెన్వెంటనే ప్రజల విప్లవపంథాను దుయ్యబట్టడానికి, కొత్త గొంతులను నొక్కివేయడానికి కొన్ని కీచుగొంతుకలు రంగంమీదకు వస్తున్నాయి.

ఈ స్థితిలో ప్రజలవైపున వారికొరకు గొంతులువిచ్చే శక్తులవైపున నిలవడం ప్రగతిశీలుర ప్రాథమిక కర్తవ్యం.

సాహితీరంగంలోని ఈ కొత్తగొంతుకల్లో 'తిరుగబడు కవులు' ఒకరు.

ఇక్కడొక విషయాన్ని గమనించాలి.

ప్రజలకు సంబంధించిన ఒక విప్లవ సిద్ధాంతమూ - ఆ సిద్ధాంతాన్ని అమలుజరపగల నిర్మాణరూపమూ సామాజిక విప్లవాల విజయానికి కీలకమైనవి. అదేవిధంగా విప్లవ దృక్పథాలనూ, కార్యాచరణలనూ ప్రచారంలోపెట్టి, ప్రజలను ప్రోత్తేజపరచడంలో సాహితీ, సాంస్కృతిక సాధనాలు ముఖ్యపాత్ర వహిస్తాయి. ఈ రెండు రంగాలూ సామాజిక విప్లవాల విజయానికి అత్యవసరమైనవి. ఒకటి కీలకమైనది. రెండవది దానికి సహాయభూతమైన అత్యవసర సాధనం.

ఈ దృష్టితో చూచినప్పుడు తిరుగబడు కవుల కృషికిగల ప్రాధాన్యతను అర్థంచేసుకోగలం.

తిరుగబడు కవులు పీడితప్రజల కొరకు, వారి విముక్తిని కాంక్షిస్తూ కలం పట్టారన్నది నిర్వివాదాంశం.

సంకలన ప్రవేశికలో యువతరానికి యిచ్చిన పిలుపులో స్వరాజ్యం, ప్రజాస్వామ్యం, సామాన్యుడు, అతనికిగల స్వాతంత్ర్యం, విద్యావిధానం, రాజ్యాంగం, దోపిడీ, మతం తదితర అంశాలపట్ల వ్యక్తపరచబడిన భావాలన్నీ దేశవిప్లవ ప్రజానీకంయొక్క భావాలకు స్థూలంగా సన్నిహితమైనవి. ప్రవేశికలో ప్రజల తిరుగుబాటు తత్త్వాన్ని, వారి గెల్పు అనివార్యతను స్పష్టంగా చూశారు. 'అరణ్యాల్లో, కొండకోనల్లో, చెట్లల్లో, పొదల్లో కార్చిచ్చుల్లా రాజుకుంటున్న జ్వాలల్ని' చూడడంద్వారా సమకాలీన పరిస్థితులపట్ల వాస్తవిక దృక్పథాన్ని ప్రదర్శించారు. విప్లవజ్వాలల్ని పంచడానికి హస్తాలు చాచడంద్వారా విప్లవమార్గం పట్ల స్పష్టంగా commit అయ్యారు.

పీడితప్రజలకొరకు వ్రాయబడిన ఈ కవితలు ఈ వర్గాలకు చేరతాయా ! అన్న అంశాన్ని లోతుగా పరిశీలించాల్సి వుంటుంది. ఈ పరిశీలన వీరికి మాత్రమే పరిమితం కాదు. విప్లవపోరాటాలను, భావాలను బలపరుస్తూ నేడువస్తున్న కవిత లన్నింటిలోనూ ఒక లక్షణం కనిపిస్తున్నది. అది, ఆ కవితలు, ప్రధానంగా పీడితవర్గాలగూర్చి వ్రాయబడ్డాయి. సరిగ్గా ఈ వర్గాలకే కవితలు చేరవు. కనీసం సాధారణ రాజకీయ కార్యకర్తలకైనా అవి చేరవు. ఈ కవితలను ప్రజలకు ఎవరో చదివిపెట్టినప్పటికీ, ఆ కవితల్లోని భావాల నర్థంచేసుకొనడానికి ప్రజల సాధారణ భాషాపరిజ్ఞానం చాలదు. అందితే- అవి ప్రజలకు ఆకర్షణీయమైన రూపంలో (Form) వుండవు. ఇది నేడు విప్లవ సాహిత్యానికీ- ప్రజలకూ మధ్య నున్న ప్రధాన వైరుధ్యం. ఈ అంశాన్ని ఆత్మవిమర్శనా దృక్పథంతో పరిశీలించడం విప్లవకవుల కర్తవ్యం.

రచనావిధానం (Form) సమస్య ముఖ్యాంశం. వచనకవితారూపం అత్యంత ప్రజాస్వామిక విధానంగా నేడు ముందుకొచ్చింది. ఐతే- ఈ విధానానికి ప్రజాబాహుళ్యంలో నేడు పునాదులు లేవు. జనంలో, ముఖ్యంగా, గ్రామీణ ప్రాంతాల్లోని పీడితజనంలో పాటలు, బుర్రకథలు, గొల్లసుద్దులు నేటికీ బాగా ప్రచారంలో వున్నవి. గ్రామీణ శ్రమజీవులు, మహిళలు నేటికీ మోటకాడిపాటలు, కోలాటం పాటలు, బతుకమ్మ పాటలు పాడుకొనడం చూస్తాం. ఈ స్థితిలో విప్లవ కవులు, తాము చెప్పదల్చుకున్న భావాలు విశాల ప్రజానీకానికి చేరాలంటే అందు కనుగుణమైన రూపాలను గణనంలోకి తీసుకోవాల్సి వుంటుంది. ప్రజల స్థాయిని, వారికి బాగా కరతలామలకమైన శైలులను, రూపాలను చేబట్టాల్సి వుంటుంది.

ఈ రూపాల్లోని (Popular forms) అశాస్త్రీయ అంశాలను తొలగించి, నూతన రూపాలను అభివృద్ధి చేయాల్సివుంటుంది. ఆ విధంగా మాత్రమే విప్లవ సాహిత్యం లోతుగా పీడితవర్గాల్లోకి చొచ్చుకొని పోగలుగుతుంది.

వచన కవితారూపం చేబట్టిన తిరుగుబాటు కవులు ఈ అంశాన్ని పరిశీలించాలి.

'సాహిత్యం సామాన్యుడికి నేరుగా చేరడం సాధ్యపడదు!' అన్న వాదనలు తరచుగా అభ్యుదయవాదులనుండి కూడా వింటాం. సాహిత్యాన్ని, విజ్ఞానాన్ని ప్రజలకందకుండా చరిత్రనిండా నిర్మించబడిన బారికేడ్లలో ఈ వాదం ఒక ఆధునికరూపం మాత్రమే. కవిత్వానికీ– ప్రజలకూ మధ్య ఒక బ్రిడ్జ్ వుండా లనడం ప్రజావ్యతిరేకవాదం. నిజానికి ఈ బారికేడ్లను తొలగించుకొని సాహిత్యం యిదివరకే ప్రజలదగ్గరకు వెళ్ళింది. పొట్ట చీల్చితే అక్షరంముక్కరాని గ్రామీణ శ్రామిక జనం సృష్టించిన సాహిత్యం సమృద్ధిగా వున్నది. వీరు తమ ఆలోచనల్ని నోటికే పాటలుగా అల్లి పాడడం చూస్తాం. ఎక్కడో, ఎప్పుడో విన్న పాటలను పాడుకొనడం చూస్తాం. ఇదంతా ప్రజల్లో వున్న సాహిత్యసంపదకు, సాహిత్యాభిలాషకు చిహ్నం కాదా! ఈ అంశాన్ని విప్లవకవులు పరిశీలించాలి.

నేటి విప్లవ సాహిత్యంయొక్క జనరల్ స్వభావాన్ని ఈ కోణంనుండి పరిశీలిస్తూనే (దీనిలో తిరుగబడు కవులు చేరతారు) తిరుగబడు కవితా సంకలనం లోని కొన్ని కవితల్ని దిగువ పరిశీలిస్తాను.

వరవరరావుగారు 'ఆపరేషన్'లో మధ్యతరగతివర్గాల బలహీనతలను, వారి జీవన పరిస్థితులను చిత్రించడానికి మంచి ప్రయత్నం చేశారు.

ఐతే "శత్రుశిబిరంలాంటి దాని గర్భాన్ని చీల్చి....చూడాలనిపిస్తుంది...." అన్న నాల్గు పంక్తులూ భావరాహిత్యాన్ని చూపుతాయి. అదేవిధంగా...."అటాక్ చేసే సాహసమేదీ?" అనడంలో, మొదటి నాల్గు పంక్తులకూ– ఈ నాల్గు పంక్తులకూ మధ్యగల సంబంధం ఏమిటో, ఈ అటాక్ ఎందుకో అర్థంకాదు. "నిండు బుక్క నోట్లో పెట్టుకోబోతే.... జర్దాకంపు వస్తుంది" అనడం బాగుంది.

'చెయ్యి'లో 'బలసిన కండల్ని కాల్చి– భవిష్యత్తు దీపాన్ని వెలిగించు' అన్న విప్లవాత్మక ప్రబోధం వున్నది.

"పంజా ఎత్తు" బాగున్నది.

లోచన్‌గారి "ట్రిగర్‌పై వేళ్ళతో" అన్న కవితలో సమాజవ్యవస్థపై నిశితమైన, సూటైన విమర్శ వున్నది. ప్రబోధం వున్నది.

"బానిస జాతి"లో 'గడ్డికరిచి ప్రభువుల ముడ్డికడిగే జాతి' అన్న దూషణ సరైంది కాదు. పేదవర్గాలు నేటి సామాజిక వ్యవస్థలో బ్రతకాల్సిన పరిస్థితుల్లో సంతరించుకున్న కొన్ని అవలక్షణాల్లో బానిసవృత్తి ఒకటి. వారిని వోపిగ్గా సరైనమార్గంలోకి తెచ్చుకోవడానికి యత్నించాలి. మొత్తంగా తిట్టడం పరిష్కారం కాదు. ఆ లెక్కన పీడితవర్గాలు అన్నిదశల్లోనూ పీడకవర్గాల దాస్యం చేస్తూనే వస్తున్నారు. వారే ఒకానొక దశలో తిరుగబడి పీడకులను కూల్చుతున్నారు. అదే సమయంలో పీడకవర్గాల ఏజెంట్లుగా మారి, పోరాటాల్లో కలిసిరాక ప్రజావ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొనేవారుకూడా పేదవర్గాల్లో వుంటారు. వీరు శత్రువర్గాల్లో చేరతారు. ఐతే మొత్తంగా ప్రజలపట్ల, వారి లోపాలపట్ల సరిదిద్దే వైఖరి తీసుకోవాల్సిందేగాని శత్రువైఖరి కాదు.

అశోక్‌గారి "పీడకలలు", "సాధు సర్ప విశ్వాలయాలు" అన్న కవితలు బాగున్నాయి.

"నేల కొరుగున్న ధ్వజస్తంభము"లో సంజీవరావుగారు దేవుడి పొత్తి కడుపులో, ఆయనకు ప్రాణప్రతిష్ఠ చేసినవాడిచేతనే, చురకత్తి దించారు. దేవుడి మానభంగం జరిగిన పద్ధతి సమర్ధవంతంగా వున్నది.

"కుక్కబ్రతుకు" అర్ధరహితంగా వున్నది. కవి ఏం చెప్పదల్చుకున్నాడో అర్ధంకాదు.

సుధాకర్‌గారి "రౌడీ" "గుడి, బడి, గడీ" లో ఫ్యూడల్ లక్షణాలు చక్కగా చిత్రించడం జరిగింది.

"రాజీ అసంభవం" అన్న యాదగిరిరావుగారి కవితనిండా పొడిమాటలు కనిపిస్తాయి. "కాగడా", "దీపావళి" బాగున్నాయి.

కిషన్‌గారు "కుళ్ళిన అన్నానికే ముంటుంది రుచి" లో

'నాకన్నా వయసులో చిన్న
నాకన్నా అనుభవంలో చిన్న
నాకన్నా ఆలోచనలో చిన్న'

అనడంలో reasoning సరిగా లేదు. పై మూడిట్లో ఏవీ ఒకరి ఆధిక్యతకు

నిదర్శనాలు కాజాలవు. శ్రమజీవి ఆధిక్యత సమాజసంపదల్ని సృష్టించడం లోనూ, యజమాని అల్పత్వం ఆ సంపదల్ని కాజేయడంలోనూ వుంటుంది. ఈ contrast చూపివుంటే బాగుండేది.

"లేవరేం!" అన్న పిలుపు పీడితప్రజలకు వుద్దేశించబడినది. దీనిలో కిషన్‌గారు 'కోరికల చెరసాలలు' లేని.... విశ్వజనీనతకు" వెళ్దామంటున్నారు. కోరికలు చెరసాలలు కావు. అవి పురోగమనానికి సోపానాలు కాగల్గుతాయి. అదే విధంగా తిరోగమనానికి కూడా దారితీస్తాయి. ఐతే– వాటి స్వభావాలనుబట్టి ఫలితా లుంటాయి. కిషన్‌గారు చేరుకొనగోరుతున్న లోకంలో కూడా కోరిక లుంటాయి. దోపిడీవర్గాల కోరికలను చెరసాలల్లో బంధించి, పీడితవర్గాల కోరికలకు రూప కల్పన చేయడమే కిషన్‌గారు కోరుతున్న విప్లవ సమాజ నిర్మాతల లక్ష్యం. విప్లవ పోరాటాల్లో ప్రజలుచేసే రక్తతర్పణను, ప్రాణత్యాగాలను "గర్తర్ల"తో కిషన్‌గారు పోల్చారు. ఇది ప్రజల బలిదానాలను కించపరుస్తుంది.

సుదర్శన్‌గారు "కవిత్వం కాదిది" అన్న కవితలో "జడంగా పడివున్న జాతి.... తాటాకు చప్పుళ్ళకి.... మేలుకొంటుందన్న 'దురాశ'ని త్రుంచెయ్!" అని యువతరానికి పిలుపిస్తున్నారు.

నేటి పరిస్థితులపట్ల బాగా విసిగి, విప్లవపంథాలో తప్ప మరోమార్గంలో విముక్తి సాధ్యంకాదన్న నిర్ణయానికి వచ్చిన యువతరం అదే తీవ్రతలో ప్రజలు విప్లవపంథా చేపట్టడం లేదని విసిగి, తిట్టిపోయడం అక్కడక్కడా నేడు చూస్తాం. దీనిలో రెండు లక్షణాలున్నాయి. 1) ప్రజల విప్లవ స్వభావాన్ని చూడలేక పోవడం; 2) ప్రజలకంటే తామే నిజమైన విప్లవకారులమని చాటుకోజూడ్డం. ఈ రెండూ విప్లవకారుల్లో వుండకూడని లక్షణాలు.

సుదర్శన్‌గారి పై కవితలో ఈ లక్షణాలు కన్పిస్తాయి.

ప్రజల్లో జడత్వం పేరుకొనడానికి కారణం ఆ ప్రజల్లో విప్లవచేవ లోపించి వుండడం కాదు. చరిత్ర పొడుగునా పరివర్తనావాదులు ప్రజల విప్లవ చైతన్యం పెరగకుండా చేయడానికి, అది కార్యరూపం తీసుకొనకుండా అదిమి పెట్టడానికి యత్నిస్తున్నా, నిర్బంధాలూ, హింసాకాండ స్వైరవిహారం చేసినా ప్రజలు వీటి నెదిర్చి, విప్లవలక్షణాలను ప్రదర్శించిన సందర్భాలున్నాయి. నేటి దశకు అభివృద్ధిచెందిన మానవ సమాజంలో వివిధ కాలాల్లో, దశల్లో ప్రజలు

చేపట్టిన, చేపట్టున్న పోరాటరూపాలు ఎవరో గదుల్లో కూర్చొని ప్రయోగాలు చేసిగానీ, పుస్తకాలతో తలబ్రద్దలు కొట్టుకొనిగానీ రూపొందించినవి కావు. వివిధ దశల్లో ప్రజలు తమ్ముతాము కాపాడుకొనడానికి, శత్రుదాడిని తిప్పికొట్టడానికి ఆయా పోరాటరూపాలను చేబట్టాల్సిన ఆవశ్యకతను గుర్తించి, చేపట్టారు. ఈ విధంగా ప్రజల పోరాటాల అభివృద్ధిక్రమంలోనే వివిధ పోరాటరూపాలు పుట్టి అభివృద్ధి చెందినవి. అన్నిసందర్భాల్లోనూ ప్రజలే నిజమైన విప్లవకారులు, మార్గదర్శకులు. ప్రజల విప్లవస్వభావం చూడ నిరాకరించినవారు, ప్రజలకంటే తామూ ముందున్నామనీ, వుండగలమనీ అనుకున్నవారూ ప్రజలను వదలి, కొన్ని సాహసచర్యలకు పూనుకొని, విప్లవాలను తుదికంటా తీసుకుపోవడంలో విఫలమైన వుదాహరణలు చరిత్రలో కనిపిస్తాయి. అదేసమయంలో ప్రజలపై విశ్వాసముంచినవారు ఒకానొక సందర్భంలో ప్రజల్లో కన్పించే అచేతనత్వాన్ని చూసి విసిగిపోకుండా, వారి విప్లవశక్తులను జాగృతపరిచి విజయవంతంగా పోరాటాలకు నాయకత్వం వహించినట్లు ప్రపంచ విప్లవ చరిత్ర చెప్తుంది.

ఈ వాస్తవాన్ని పరిశీలించాలన్నదే సుదర్శన్‌గారికి నేను చేయగల సూచన.

"అజ్ఞానం + భయం = మతం" అన్న నిర్వచనం బాగానేవున్నది. ఐతే - యిది అసంపూర్ణ నిర్వచనం. ప్రజలకు సంబంధించినంతవరకు మత భావాలకు అజ్ఞానం, భయం మాత్రమే కారణం. దోపిడీవర్గాలకు సంబంధించి నంతవరకు యివి కారణాలుకావు. ప్రజల్ని అజ్ఞానంలోకి, భయంలోకి, మైకం లోకి త్రోసే ఈ నల్లమందు వ్యాపారులు చేస్తున్నది పెద్దకుట్ర. మతానికి వున్న ఈ దోపిడీవర్గప్రయోజనాన్ని మతానికియిచ్చే నిర్వచనంలో తప్పనిసరిగా చేర్చాలి. అప్పుడే దాని దుష్టస్వభావం పూర్తిగా స్పష్టమవుతుంది.

"త్యాగాలు....పంటపొలాలకు తెచ్చే నెత్తురుకాల్వలు" అన్న ఎక్స్‌రేగారి నిర్వచనం నూటికి నూరుపాళ్ళు సరైనది.

ప్రణాళికల పాత్రను, పాలకవర్గాల, వారిరాజ్యాంగ స్వభావాన్ని, ఓట్ల ప్రయోజనాన్ని "రాజూ-రాణీ" చక్కగా బయట పెడ్తున్నది.

"దప్పిక ఎరుగని ప్రభుత్వం గుర్రాన్ని
సోషలిజం తటాకం ఒడ్డున వదులు"

అంటేఏమిటి? దప్పికలేని గుర్రాన్ని సోషలిజం తటాకం (నీరులేని తటాకం) వద్దవదలినా, నీరున్న తటాకందగ్గరొదెలినా ఒకటే. ఇచట భావవ్యక్తీకరణలో లోపం కన్పిస్తున్నది.

"దేవుడా నువ్వొక ప్లేగువి"లో నీ పుట్టలోంచి పెరిగిన పాములు.... విషం కక్కుతున్నాయి అనడం బాగుంది.

'ఐ'గారు 'గురి'లో సగభాగంలో ప్రజల అచేతనత్వాన్ని వివరించడానికి— మిగతాభాగంలో ఈ అచేతనత్వాన్ని పెంచడానికి, వినియోగించుకొనడానికి, మొత్తంగా ప్రజల్ని హత్య చేయడానికి అవకాశవాదులు చేస్తున్న యత్నాలను వివరించడానికి యత్నించారు. మొదటిభాగంలోని భావాల్ని అంతకంటే తక్కువ మాటల్లో చెప్పివుంటే బాగుండేది. రెండవభాగం బాగానేవున్నది.

"ఒంటరిగుంపు" తేలికైన భాషలోనేవున్నా, భావవ్యక్తీకరణలో perfection లేదు. దానివల్ల పాఠకుల గుండెల్లో అది కల్గించగల ప్రభావం అతి స్వల్పం.

"తిరుగబడు"లో దశాబ్దంకింద చచ్చిన శవానికి తిరుగబడు!' అని 'ఐ'గారు ప్రబోధించడం విచిత్రంగావున్నది!

కొన్ని కవితలను మాత్రమే నేనిక్కడ పరిశీలించడానికి యత్నించాను. సంకలనంపై స్థూలంగా అభిప్రాయం చెప్పాలంటే—

పీడితజన విముక్తికి విప్లవమే మార్గమన్నది తిరుగుబడు కవులందరి అవగాహన.

భావాల వ్యక్తీకరణలో అక్కడక్కడా కొద్దిపాటి అస్పష్టతలు కన్పించినా వాటి నధిగమించడం సాధ్యం. ఈ అస్పష్టతలను మైక్రాస్కోపుల్లో చూడనవ సరంలేదు.

పీడితప్రజల వాస్తవ జీవితాలకు సంబంధించిన లోతైన అవగాహన లోపిస్తున్నది. ముఖ్యంగా ఫ్యూడల్ సమాజలక్షణాలను వీరు మరింత నిశితంగా పరిశీలించాలి. సమాజంలోని వివిధవర్గాలను, ఆవర్గాల ఆలోచనా విధానాలను - ఆ వర్గాలమధ్యవున్న సంబంధాలను బాగా అధ్యయనం చేసినప్పుడే కవితల్లో జీవం పుట్టిపడుతుంది. భావాలు సంపన్నంగా, సక్రమంగా వుంటాయి.

కవితల్లో చాలాచోట్ల పొడిపదాలు, నినాదాలరూపంలో భావప్రకటనలు కనిపిస్తాయి. సాహిత్య ప్రక్రియకిది సరిపడని లక్షణం. కవిత్వంలో భావాలు అస్పష్టంగాఉండడం ఎంతనేరమో, కళాత్మక విలువలు లోపించడం అంతే హానికరం. ఒక కవితలో మంచిదృక్పథం లోపించి, ఎంతగొప్ప కళాత్మక విలువలను సింగారించుకున్నా అది శవాలంకరణంగానే వుంటుంది. అదేవిధంగా కళాత్మక విలువలు లోపించి, పొడి నినాదాలుగా దృక్పథాలు కవితల్లో ప్రకటిస్తే అవెంత మంచివైనప్పటికీ అవి సజీవంగా వుండవు. దీన్నిబట్టి దృక్పథాలను— కళాత్మక విలువలతో సమర్ధవంతంగా ఐక్యపర్చడంలోనే కవుల విజయం వున్నది. ఈ సామర్థ్యాన్ని తిరుగబడు కవులు పెంచుకోవాలి.

వచన కవితకు తోడుగా, popular forms లో సాధన చేయాలి. ఆ రూపాల్లో విరివిగా కవితలు వ్రాయాలి.

సంకలనంలో విప్లవపోరాటాలకు సంబంధించిన లోతైన అవగాహన లోపిస్తున్నది. ఈ లోపాల్లేకుండా విప్లవకవులు సజీవమైన రచనలు చేయాలంటే—పుస్తకపరిజ్ఞానం చాలదు. దానివల్ల ప్రజ లనుసరించే పోరాటా రూపాలనూ, క్రమాన్నీ, నిత్యజీవితంలోనూ, పోరాటక్రమంలోనూ ప్రజలెదుర్కొంటున్న సమస్యలను వారు అర్థంచేసుకోలేరు. రచనలు పాక్షిక వాస్తవాలపైన, అసమగ్ర వివరాలపైన ఆధారపడ్తాయి. కనుక కవులు ప్రజల్లోకి వెళ్ళి, వారి సమస్యలను, పోరాటానుభవాలను స్వయంగా పరిశీలించాలి. అప్పుడే వారి పరిజ్ఞానం సమగ్రం కాగలుగుతుంది.

రాష్ట్రవ్యాపితంగావున్న విప్లవకవులు కృషిని సమన్వయపరిచి, విప్లవోద్యమావసరాలను గుర్తించి, దాని పురోగమనానికి తోడ్పడే పద్ధతుల్లో కార్యకలాపాలను మేళవించి, విస్తృతం చేయాలి. ఈ కర్తవ్యనిర్వహణలో తిరుగబడు కవులు చొరవ తీసుకోవాలి.

ప్రజలపట్ల–ప్రజాశత్రువులపట్ల తీసుకోవాల్సిన వైఖరిపట్ల స్పష్టతవుండాలి. వెనుకబాటు చైతన్యంగల ప్రజల్ని ఓపిగ్గా educate చేసి ముందుకు నెట్టడం, విప్లవ పంథా చేపట్టిన ప్రజల్ని దృఢంగా సమర్థించి, మరింత వుత్తేజపరచడం ప్రజలపట్ల తీసుకోవాల్సిన జనరల్ దృక్పథం. ప్రజాశత్రువుల ముసుగుల్నిలాగి వేసి, వారిని ఎండగట్టడం, ప్రజలశక్తిని, పురోగమనాన్ని చిత్రించి, శత్రువుల

గుండెలదరగొట్టి, వారి పతనం అనివార్యమని మళ్ళీమళ్ళీ చాటి చెప్పడం ప్రజా శత్రువులపట్ల తీసుకోవాల్సిన దృక్పథం.

విప్లవలక్ష్యంతో, నేటి చారిత్రక కర్తవ్యాన్ని గుర్తించి, ఈ మార్గం ఎంతకంటకావృతమైనదో, ఎన్ని తుఫానులను ఎదుర్కొని నిలవాల్సివుంటుందో తెల్సుకొని పీడిత ప్రజల పక్షాన నిలవడానికి ముందుకువచ్చిన తిరుగబడు కవులకు విప్లవాభివందనలు తెల్పడం, వారి లోపాలను స్నేహపూరితంగా విమర్శించి, వారు చాచిన తిరుగుబాటు హస్తాన్ని అందుకొనడం 'వెన్నెముకా' ముందుచూపూ వున్న ప్రతివాడూ చేయాల్సినది. ఈ హస్తాన్ని అందుకొనడంలో యోగ్యత సంపాదించడానికి యత్నిస్తానని చెప్తూ ముగిస్తాను.

—కె. కృష్ణమూర్తి

---


విద్యార్థులకు మాత్రమే

విద్యుల్లత

కథానికల పోటీ

బహుమతి రు. 100/-

వివరాలకు ఈ క్రింది చిరునామాకు రాయండి

ఎడిటర్

విద్యుల్లత

సాహిత్య మాస పత్రిక

కరీంనగర్

డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారితో

# ఇష్టాగోష్ఠి

*రంగనాథం*

గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషోద్యమం ఆరంభించి సుమారు అర్థశతాబ్దంపైగా గడిచిపోయినా ఇంకా విశ్వవిద్యాలయాలు తలుపులు తెరవనేలేదు. ప్రజల భాషలో పరిపాలన సాగాలంటున్న ఈ రోజుల్లో వ్యావహారిక భాషోద్యమాన్ని ఇంకా తీవ్రతరం చేయాల్సిన అవసరం వుంది. శ్రీ శ్రీ అన్నట్టు గ్రాంథికభాష ఎక్కడా ఆశ్రయం లేక విశ్వవిద్యాలయాల్లో తలదాచుకుంది. ఉస్మానియా విశ్వవిద్యాలయ లింగ్విస్టిక్ శాఖాధ్యక్షులు డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు కృషి ఈ విషయంలో శ్లాఘనీయం. చేయవలసింది ఇంకా చాలా వుంది. విద్యార్థులలోనూ, ప్రజలలోనూ ఒక మహోద్యమ రూపంలో వ్యాపింపజేయవలసిన అవసరం ఎంతైనావుంది. భాషా విషయంలో ఈ మధ్య సాగుతున్న సిద్ధాంత రాద్ధాంతాలలో డా॥ భద్రిరాజుగారి అభిప్రాయాలను తెలుసుకోవాలని 22-2-1970 ఆదివారంనాడు ఇష్టాగోష్ఠిగా చర్చించడం జరిగింది. ఆ అభిప్రాయాలనే ఇక్కడ పొందుపరుస్తున్నాను.

సుమారు రెండు గంటలు సాగిన ఇష్టాగోష్ఠిలో కృష్ణమూర్తిగారు గిడుగు రామమూర్తి పంతులుగారి కాలంనుంచి జరుగుతున్న ఉద్యమాన్ని సమీక్షించారు. పండితులు 'గ్రాంథిక భాష' అని అనుకుంటున్న భాషా స్వరూపం ఇదమిత్థమని నిర్ణయించడానికి సాధ్యంకాదని, గ్రాంథికవాదులు గ్రాంథిక భాషలో నిర్దుష్టంగా రాసిన గ్రంథం ఉదాహరణకు ఒక్కటైనా దొరకదని పండితుల గ్రంథాలనుంచే ఉదాహరణలను ఎత్తిచూపారు రామమూర్తి పంతులుగారు. కాబట్టి అలాంటి భాషలో గ్రంథరచన అసాధ్యం అని ఆనాటి పండితులందరూ తెలుసుకున్నారు. అందుకని సరళ గ్రాంథికాన్ని సృష్టించుకొన్నారు. అది అటు ప్రాచీన కావ్యాల్లోనూ ఇటు వ్యావహారికంలోనూ లేని ఒక కృత్రిమమైన భాష. రాతలో ఉండి వ్యవహారంలో లేనిది గ్రాంథికభాష. రాతలోనూ వ్యవహారంలోనూ వుండే భాష

వ్యావహారికం. రాతలోనూ వ్యవహారంలోనూ లేనిది సరళ గ్రాంథికం అని చమత్కరించారు కృష్ణమూర్తిగారు.

పాఠ్య గ్రంథాలలో వుండవలసిన భాషను గురించిచెప్తూ అధ్యాపకుడు ఏ భాషలో బోధించగలడో ఆ భాషలోనే పుస్తకాలు రాయాలి అన్నారు కృష్ణ మూర్తిగారు. అయితే భాషను ప్రమాణీకరించడం మన చేతులలో లేదు. చెయ్యాలి అనే దానికి చెయ్యాలె అనే దానికన్నా ఎక్కువ శక్తిలేదు. ఏది ప్రమాణమో కాలమే నిర్ణయిస్తుంది. వ్యావహారిక భాషలోవుండే వైవిధ్యం దాన్ని ఉపయోగించుకోవడానికి అడ్డంకి కాదు. నిజానికి కావ్యభాషలో ఇంతకన్నా వైవిధ్యం వుంది. అయితే ఆయా పదాలను గ్రహించేటప్పుడు ఒక విషయాన్ని దృష్టిలో వుంచుకోవాలి. Grammatical form లో రెండుమూడు రూపాలుంటే ఏది ప్రాచీన రూపానికి దగ్గరగా వుంటుందో దాన్ని తీసుకోవాలి. మరీ ముఖ్యంగా ఎక్కువ ప్రాంతాల్లో ఏది వుంటుందో అది తీసుకోవాలి. ప్రాచీన కావ్యభాషతో పోల్చి చూచుకుంటే వార్తాపత్రికల్లో, రేడియోల్లో, ఉపన్యాసాల్లోవాడే భాషలో వైవిధ్యం తక్కువగా వుంది.

తెలుగు అకాడమీవాళ్ళు ప్రచురించిన పాఠ్యగ్రంథాలను గురించి చెప్తూ కొన్ని రూపాల్లో కొంతవైవిధ్యాన్ని Accept చేశాం అన్నారు కృష్ణమూర్తిగారు. చేసాడు, చేసినాడు – రాయాలి, రాయాలె – ఇలాగ. తిరుపతి గోష్ఠిలో ద్వితీయ భాషగా శిష్టవ్యావహారికం, విషయ ప్రధాన భాషలకుకూడా వ్యావహారికం, భాషా ప్రధానమైన గ్రంథాలకు సరళగ్రాంథికం వాడాలని తీర్మానించడం జరిగింది. ఈ గోష్ఠిలో మూడు విశ్వవిద్యాలయాల ప్రతినిధులు, కవులూ పత్రికా రచయితలూ అందరూ పాల్గొన్నారు. పై తీర్మానాన్ని ప్రభుత్వం ఆమోదించిందికూడా. ముఖ్యంగా తెలుగు మాతృభాషకాని వాళ్ళకోసం ఉపయోగించే ద్వితీయభాషా పాఠ్యగ్రంథాలు వాడుక భాషలోనే ఉండాలి. లేకపోతే గ్రాంథికం చదివి అత దలాగే మాట్లాడబోతే మనమే నవ్వుతాం. అయినా వ్యావహారికంలో రాసిన 2nd Language పుస్తకాలకు మినిస్టరుగారు తాత్కాలికంగా stay ఇచ్చారు. మొదట వొప్పుకొని మళ్ళీ ఇలా ఎందుకు చేసారన్న ప్రశ్నకు భద్రిరాజుగారిలా సమాధానం ఇచ్చారు. I do'nt think he has banned the books. He only stayed it.

అసలు పిల్లలకు ఏ భాషలో పాఠాలు చెప్పాలన్నప్పుడే భాషను గురించి Awareness వచ్చింది. 1911 లో సాహిత్యసమితి ఏర్పడింది మొట్టమొదట

పాఠ్యగ్రంథాలు వ్యావహారికంలోనే వచ్చినై. చిన్నయసూరి బయలుదేరింతర్వాత మాత్రమే అన్నీ గ్రాంథిక భాషలో రావడం మొదలెట్టాయి. బాలవ్యాకరణం ప్రకారం ప్రాచీన భాషలో వాక్యనిర్మాణం ఎవరికీ తెలీదు. ఏ వ్యాకరణమూ చెప్పలేదు. ఈ పండితులకి వాడుక భాషలో రాయడం ఇష్టంలేదు, గ్రాంథికంలో రాయలేరు. అందుకనే సంప్రదాయంలోనూ వ్యవహారంలోనూ లేని భాషను సృష్టించుకున్నారు. ఆధునిక భాషలో ఆలోచించి గ్రాంథికపు Inflexions తగిలిస్తున్నారు. ప్రాచీన కాలానికి వెళ్ళిచూస్తే Prose writings మనకు ఎక్కువగా లేకపోవడం వల్ల వ్యావహారికంలో రచనలు లేవు. మొదటి దశలో నాటకాలు గ్రాంథిక భాషలోనే రచింపబడ్డా అది చాలా కొద్దిరోజులేవుంది. వాటిల్లోకూడా ప్రజలను Appeal చేసింది పద్యాలే.

ప్రాచీన కాలంలోనైనా ప్రజలందరికీ అర్థమయ్యేట్టు రాసినవన్నీ వ్యావహారిక భాషలోనే వున్నాయి. అలాగే మనకున్న కొద్దిపాటి వచనసాహిత్యం వాడుక భాషలోనే వుంది. యక్షగానాలు ప్రజలకోసం రచింపబడ్డాయి. కాబట్టి వాడుక భాషలోనే వచ్చాయి. రాయవాచకంలో వాడుకభాషవుంది. అలాగే వాగ్గేయాలూ, వ్యాఖ్యానాలూ, శాసనాలు వ్యావహారిక భాషలోనే వున్నాయి. పద్యాశ్రయ కావ్యాలు సామాన్య ప్రజల నుద్దేశించినవి కావు. ప్రజలకు సంబంధించిన ప్రక్రియలలో వాడుక భాషేవుంది. అయితే నే నసలు గ్రాంథికమే చదవొద్దని చెప్పడంలేదు. ప్రాచీన సాహిత్య స్వరూపం తెలుసుకోడానికి, భాషాస్వరూపం తెలుసుకోవడానికి ప్రాచీన గ్రంథాలను చదవాల్సిందే, ప్రత్యేక పరిశోధనలు చేసేవారికి అది మరీ ముఖ్యం. అయితే అవి చదివింతర్వాత వాటిని గురించి మనం రాసేవన్నీ వ్యావహారికంలోనే వుండాలి.

ఎగ్జామినేషన్సులో రాయవలసిన భాషను గురించి గోష్ఠిలోగాని, ఇతర కమిటీలలోగాని చర్చించలేదన్నారు కృష్ణమూర్తిగారు. ఇప్పుడది స్పష్టం చేయనవసరం లేదు. పుస్తకాలలో ఏ భాష వుంటుందో విద్యార్థి సహజంగానే ఆ భాషలోనే పరీక్షలు రాస్తాడు. అయినా ఒక విషయం మాత్రం చెప్పాల్సివుంది. ఎవరో కొద్దిమంది పండితులు గ్రాంథికంతరపున మాట్లాడుతున్నారే గాని నూటికి 99 మందికి ఇది సమస్యేకాదు. పత్రికలు మొదలైనవాటిల్లో వాడుకభాషే కనిపిస్తోంది. 99% ఈ స్ట్రీమ్‌లో ఉన్నవాళ్ళే. 100 పుస్తకాలు వస్తే ఒక్కపుస్తకం కూడా ఈ రోజుల్లో గ్రాంథిక భాషలో రావడంలేదు. గ్రాంథికవాదుల మాటలో

ప్రజలను మార్చే బలం లేదు. Influence చేసే శక్తి లేదు. ప్రతిదశలో జరుగుతున్నట్టుగానే మార్పును చూచి భయపడుతున్నారు. దాని Reaction గానే మళ్ళీ కొద్దిగా తలయెత్తడానికి వాళ్ళు ప్రయత్నం చేస్తున్నారు. వాళ్ళు ఉదాహరణగా తమిళదేశంలోని భాషను ఉదహరిస్తున్నారు. తమిళం శిష్టవ్యవహార రూపంలో తక్కిన భాషల్లోలాగా అంతగా మార్పులేదు. అన్నాదురై ఉపన్యాసాల్లోగాని, కథల్లో గాని, క్లాసుపాఠాల్లోగాని గ్రాంథికభాషే ఉపయోగించడం జరుగుతోంది. తెలుగులో అలాంటి సంప్రదాయంలేదు. శిష్టులు వ్యవహరించే భాషలో ఎప్పటికప్పుడు మార్పులు వస్తున్నాయి. అలా వ్యవహరించే భాషలోనే రాసే సంప్రదాయం మనకుంది ఇక్కడ మరో విషయం చెప్పాలి. శిష్టవ్యావహారికం అంటే కోస్తాభాష అనే అపోహవుంది. అది పోవాలి.

ఇజ్రాయిల్‌లో యూదులు సుమారు మృతభాష అయిన హీబ్రూభాషను ఎలా Revive చేయగలిగారనే ప్రశ్నకు వారిలా సమాధానం ఇచ్చారు. యూదులు చాలా కాలం తర్వాత Nation గా ఏర్పడ్డారు. కాబట్టి వాళ్ళకో Common భాష అంటూ లేకపోవడం వల్ల ఆ పాత భాషని స్వీకరించాల్సి వచ్చింది. అయినా అది వ్యావహారిక భాషల్లాగా సహజంగానే మారుతున్నది. And they are accepting it. అసలు యూదులకి Geographical homogenity కూడా కృత్రిమం. తక్కిన దేశపరిస్థితులతో ఆ దేశ పరిస్థితులు పూర్తిగా భిన్నం. మన దేశంలో ప్రస్తుతం వున్న 14 భాషలకి కూడా Existance లేకుండా 700 other dialects లాగ వుంటే మనం కూడా అలాంటి మృత భాషనే స్వీకరించాల్సి వచ్చేదేమో. అయినా We are a state without nation.

భావ విప్లవం లాగ భాషా విప్లవంకూడా సాధ్యమా? అన్నదానికి వారి అభిప్రాయం ఇలా వుంది. భాషా విప్లవం అంటూ ఏదీ వుండదు. భాషలో ఎప్పుడూ మార్పులు వస్తూనే వున్నాయి. The question of విప్లవం does not arive. విప్లవం – అన్నది do you apply against few individuals? It has no deep root. Established order అంటూ లేనప్పుడు విప్లవం ప్రసక్తేలేదు. ప్రజల వ్యవహారానికి దూరమైనదేదీ సాహిత్యంలో నిలవదు.

నన్నయ తెలుగుభాషని Sanskritise చేసి తెలుగుభాష వినాశనానికే దారితీసాడన్న అభిప్రాయాన్ని కృష్ణమూర్తిగారు నిరాకరించారు. నన్నయభాష అతనికాలంలో గాని అంతకుముందుగాని వ్యవహారంలో వుండివుంటుంది.

కొత్తగా భాష నెవరూ సృష్టించడం జరగదు. నన్నయ భాష 2, 3 వందల సంవత్సరాల పరిణామ ఫలితం. తన కాలంలో వ్యవహారంలోవుండే ఒక భాషను నన్నయ గ్రహించాడు. సంస్కృతంకూడా ఆ రూపంలో ఒకప్పుడు వ్యవహారంలో ఉండేదనే భద్రిరాజుగా రభిప్రాయపడ్డారు. ప్రాచీన కవులు కొన్ని కొన్ని పదాలు ఛందస్సులో ఇమడకపోతే కావాలని వాటిని వికృతం చేసి ప్రయోగించారనే దిగంబర కవుల ఆరోపణతో కూడా కృష్ణమూర్తిగారు ఏకీభవించలేదు. ఛందస్సు కోసం ఎవరూ వ్యాకరణం సృష్టించరు. చేసిం దేమిటంటే గణాలకోసం భాషలో వచ్చిన మార్పులను ఉపయోగించారు.

ఈ సందర్భంలో ఆధునిక కవుల గ్రాంథిక ప్రయోగాల ప్రసక్తివచ్చింది. శ్రీశ్రీ మొదలుకొని దిగంబర కవులవరకూ అందరిపైనా ఈ ప్రభావం వుందన్నారు కృష్ణమూర్తిగారు. అయితే ఆ ప్రభావంనుండి సాధ్యమైనంత పూర్తిగా తప్పించుకోవడానికి ప్రయత్నం చేస్తున్నామనీ, ప్రాచీన సంప్రదాయాన్ని సూచించే, జ్ఞాపకంచేసే ఏ పదాన్నైనామేం ఉపయోగించబోమనీ అన్న దిగంబర కవుల అభిప్రాయాన్ని వారు ఖండించారు. Creative writer always looks for a wide choice. He exploits the tradition. They are (దిగంబర కవుల) misusing the word tradition. In any creative writing they all do it. They are entertaining some funny notions about language. తిలోదకాలనే మాటని ఒక context లోనే ఉపయోగించే వాళ్ళు. తరువాత చాలా contexts లోకి మారాయి. అంటె అర్థం మారిందనేగదా? ఉదాహరణకి గ్రాంథిక భాషకి తిలోదకాలిచ్చాం. 100 లో 99 పదాలకి etymology తెలియదు. ఎక్కడో ఒక మాటకి తెలిసినందువల్ల అది disadvantage కాకూడదు.

శ్రీశ్రీ 'హరోం హర' అనేదాన్ని శైవ జంగాల అర్థంలో వాడలేదు. He has taken it in a powerful movement. అలాగే మల్లారెడ్డి 'శంఖారావం'. దిగంబర కవులలోకూడా అనేక గ్రాంథిక రూపాలున్నాయి. రచయిత wide range ని కోరుతాడు భావాలను వ్యక్తీకరించడానికి. అయితే ఏ పదాలను ఉపయోగించుకోవాలో, ఉపయోగించుకో కూడదో రచయిత యిష్టం. కాని సృజనాత్మక శక్తిలో ఇరుక్కునే భాషా విషయకమైన notion కు గురికావడాన్ని నేను ఖండిస్తాను. ఇది ఒక రకమైన linguistic superstition. అయితే

భాషలోలాగే content లో కూడా మార్పురావాలనే దిగంబర కవుల అభిప్రాయంతో కృష్ణమూర్తిగారు ఏకీభవించారు.

డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు రెండు గంటలసేపు ఉల్లాసంగా అడిగిన ప్రశ్నలన్నింటికి ఆగకుండా సమాధానాలిచ్చారు. చేకూరి రామారావు, శ్రీపతి, పి. సి. నరసింహారెడ్డి మొదలైన వాళ్లందరూ ఇష్టాగోష్ఠి చర్చలో పాల్గొన్నారు. అయితే ఈ మధ్య భాషా విషయంలో వస్తున్న ప్రకటనలను, వ్యాసాలను చదివిన తర్వాత, విశ్వవిద్యాలయంలోని గ్రాంథిక వాదులను, వ్యావహారికవాదులను విన్న తరువాత ఒక అభిప్రాయం కలుగుతోంది. scholars గ్రాంథికవాదులు గాని, వ్యావహారికవాదులు గాని ప్రజావసరాలను మరచిపోయి ఆలోచిస్తున్నారు. గ్రాంథికవాదులకు వ్యక్తిగత దృష్టి మాత్రమే వుంది. సమాజంతో వారికి సంబంధం ఏనాడూ ఉంటుందనుకోను. ఇక వ్యావహారిక భాషావాదులకు భాషను గురించి సరియైన శాస్త్రీయ దృక్పథం వుంది. కాని దీనికి కేవలం శాస్త్రీయ దృక్పథం మాత్రమే చాలదు. వ్యావహారికవాదం ఉద్యమరూపం ధరించాలి. శాస్త్రీయ దృక్పథాన్ని ప్రజావసరాలతో సమన్వయం చేసినప్పుడే ఇది సాధ్యమవుతుంది. ప్రజలకు ఈ విషయాలను నచ్చజెప్పగలగాలి. అవసరమవుతే scholars విశ్వవిద్యాలయాల బయటకూడా ధైర్యంతో ఉద్యమాన్ని చేపట్టగలగాలి. ప్రజలు ఆ అవసరాన్ని గుర్తించేట్టు చెయ్యాలి. కేవలం కొన్ని సూత్రీకరణలు, సమన్వయాలలో మాత్రమే మిగిలిపోతే గ్రాంథిక వాదులు పాత పండితులవుతే, వీరు కొత్త పండితులుగా మాత్రమే మిగిలిపోయే అవకాశం వుంది.



# సాహిత్య లేఖలు

సృజన-శ్రీశ్రీ సాహిత్య సమాలోచన Special Issue కొన్ని చమత్కార మైన అంశాలను ఆవిష్కరించింది. వాటిలో మొదటిది శ్రీశ్రీకి మార్క్సిజంతో గాఢపరిచయం లేదనేది. 'అప్పటికీ ఇప్పటికీ మార్క్సిస్టు సిద్ధాంతంగురించి స్థూలంగా తప్ప శ్రీశ్రీకి తెలియదు' అని (పు. 10) రమణారెడ్డి అభిప్రాయ పడ్డారు. చేకూరి రామారావుకూడా శ్రీశ్రీతో ఏకీభవిస్తూ తమ వ్యాసం చివర, వ్యాసంలో చర్చించగా తేలిన అంశాలని list వేసి, అందులో 'శ్రీశ్రీకి ఉన్న మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానం పరిమితం, అవసరమైన అవగాహన మాత్రం ఉన్నది' (పు. 111) అన్నారు. 'అవసరమైన అవగాహన' అంటే, కవిత్వం వ్రాయటానికో, లేక తాను 'మార్క్సిస్టు'నని చెప్పుకోవటానికో స్పష్టంకాదు. మొత్తంమీద పబ్బం గడుపుకోవటానికి అవసరమైన అవగాహన అనుకోవచ్చు నేమోమరి. కాని సంచికలోని మొదటి ఇంటర్వ్యూలో శ్రీశ్రీ 'నేను మార్క్సిస్టును' అని అంటాడు. వీలయిన ప్రతిచోటా శ్రీశ్రీ ఈ అంశాన్ని గట్టిగా నొక్కి చెప్పు తుంటాడు. 'Marxism మీద నమ్మకంలేని రచయితను అభ్యుదయ రచయిత అనటానికి వీల్లేదంటారా ?' అన్న ప్రశ్నకు సమాధానంగా 'లేదు. Marxism-Leninism మీద నమ్మకం లేనివాడు అభ్యుదయ రచయిత కాలేడు' అని లెని నిజంనుగూడా కలుపుకున్నాడు. మరి మావోయిజాన్ని ఇక్కడ శ్రీశ్రీ ఎందుకు include చేయలేదో తెలియదు. మావోయిజం అంటే శ్రీశ్రీకి మరో ఉద్దేశ్యం లేదుగదా ! చీలిన కమ్యూనిస్టు పార్టీల్లో ఏ పార్టీని ఏమన్నాగూడా తాను బాధ పడుతానంటాడు మరి. అయితే శ్రీశ్రీ సమన్వయ వాదేమో! తెలియదు....అయితే మార్క్సిజాన్ని గూర్చి ఇంత గట్టిగా ఆవేశపడే శ్రీశ్రీకి తాను మార్క్సిజం బాగా తెలిసిన వాణ్ణనే నమ్మకం ఉందేమో ? కాని రెండవ ఇంటర్వ్యూలో 'మార్క్సిజా నికి మావోయిజం అతివాదబాలారిష్టం అని రష్యన్ కామ్రేడులు విమర్శిస్తున్నారు. మీరేమంటారు ?' అన్న దిగంబర కవుల ప్రశ్నకు ఏదో అందీ అందకుండా కొంత చెప్పి 'I am not competent to discuss the same' అంటాడు శ్రీశ్రీ. ఒక విధంగా తన అసామర్థ్యాన్ని ఆ విషయంలో ప్రకటిస్తాడు. దీంతో, ఇట్లాంటి మరికొన్ని సమాధానాలతో రమణారెడ్డి, రామారావుల అభిప్రాయం

బలపడుతున్నట్టు కనిపిస్తుంది. అయితే శ్రీశ్రీ రాజకీయ దృక్పథాన్ని గూర్చి 'మార్స్' రాస్తూ శ్రీశ్రీకి మార్క్సిస్టు దృక్పథం సంపూర్ణంగా ఉందని సూచిస్తారు. మరి ఈ Controdiction పాఠకుడికి కొంత Confusion కలిగిస్తుంది. శ్రీశ్రీ మార్క్సిజాన్నిగూర్చి ఉటంకించే ఇతర (ఈ సంచికలోని) వ్యాసకర్తలు అసలు, మార్క్సిజాన్ని గూర్చి ఎంత చెప్పగలరో కచ్చితంగా తెలియదు. కాగా శ్రీశ్రీ 'మార్క్సిస్టు తనం' ఆయన రచనల్లోని మార్క్సిజం స్వరూపం చర్చించి ఏదెంతో, ఎంతకాదో తేల్చవలసిన అవసరం ఇంకా ఉన్నట్టు పాఠకుడి కనిపిస్తుంది.

మరి....'మీ కవిత్వానికి మార్క్సిజానికి గల సంబంధం ఎలాంటిది ?' (పు. 2) అన్న ప్రశ్నకు 'మహాప్రస్థాన గీతం రాసే నాటికి నాకు మార్క్సిజంను గూర్చి తెలియనే తెలియదు' అంటారు శ్రీశ్రీ. అప్పటి వరకది తెలియకనేపోతే దానిమీద నమ్మకం కలిగే ప్రశ్నేలేదు. అయితే, మార్క్సిజం—లెనినిజం మీద నమ్మకం లేనివాడు అభ్యుదయ రచయిత కాలేడని శ్రీశ్రీ అన్నాడంటే, 'మహాప్రస్థానం' రాసిన శ్రీశ్రీ అభ్యుదయ రచయిత కాడనవలసొస్తుంది. మరి ఇదెంత వరకాగుతుందో చెప్పటం కష్టం. మరోటి. శ్రీశ్రీ ఎంతసేపటికీ 'మనదేశంలోని సమస్య లన్నిటినీ మార్క్సిస్టు సిద్ధాంతం ద్వారా పరిష్కరించుకోగలమన్న విశ్వాసం నాకుంది' (పు. 5) ఇత్యాదిగా విశ్వాసం అని మాట్లాడుతాడేగాని పరిష్కరిస్తుందని కచ్చితంగా అనడే. విశ్వాసంమీద stress వేస్తే fact కొంచెం పక్కకు తప్పుకొనే అవకాశం ఉంటుందా? చూడాలెమరి. ఇంకా, 'మీకు సరియైన రాజకీయావగాహనలేదు. మీరు బయటికి రావాలి' అని జ్వాలాముఖి పిడికిలి బిగించి గట్టిగా అంటే (పు. 88) పిడికిలి బిగింపును చూచో, నిజంగానో 'అవును' అన్నాడట శ్రీశ్రీ. శ్రీశ్రీ రాజకీయ పరిస్థితి ఇట్లా ఉంది. మొత్తంమీద శ్రీశ్రీ మార్క్సిజం ఇరుకున బడిపోయిందనిపిస్తుంది.

రెండో అంశం, శ్రీశ్రీ వచన రచన failure అని. ఈ అంశాన్ని కుటుంబరావు వివరించారు. చివరకు మర్యాదగా 'నన్నడిగితే శ్రీశ్రీ వచనం రాయవలసిన అవసరంలేదు' అని తేల్చారు. కుటుంబరావు దృష్టి ప్రధానంగా శ్రీశ్రీ stories కు సంబంధించిసాగింది. శ్రీశ్రీ కూడా 'I am essentially not a story writer' (ప్ర. 119) అన్నాడు. అయితే 'శ్రీశ్రీ నాటికలు' గూర్చి రామమోహనరావు వ్యాసం చదివితే, శ్రీశ్రీ essentially is not a drama

writer also అని కూడా అనిపిస్తుంది. ఎంతసేపటికీ రామమోహనరావు శ్రీశ్రీ లోని కవితాశిల్పాన్నీ, అభివ్యంజనాశిల్పాన్నీ, భావాన్నీ గూర్చి వివరిస్తారు తప్ప నాటక—నాటికా శిల్పాన్నిగూర్చి అట్టే వివరించినట్టు కనిపించదు. అయితే ఆయన సమీక్షించినవన్నీ రేడియో నాటికలే. స్టేజి నాటికలూ, నాటకాలూ శ్రీశ్రీ వ్రాసినట్టు దాఖలాలు కన్పించవు. ఏదో బ్రహ్మాండమైన విప్లవాన్నితెచ్చే నాటకాన్ని ముందు ముందు రచిస్తానని శ్రీశ్రీ కొంత promising గా చెప్పినా. ప్రస్తుతానికట్లాంటిదేమీలేదు. కాని, రేడియో నాటికలకు శిల్పం—దానికి సంబంధించి లేదా.........విమర్శకుడుగా వచన రచనలో శ్రీశ్రీ గట్టివాడని చేకూరి రామారావు నిరూపించారు. రామారావు వ్యాసంలో ఒక చమత్కారం ఉన్నది. శ్రీశ్రీ ప్రతిభను ఉత్తమ సాహిత్య విమర్శకుడుగా నిలబెట్టేవి శ్రీశ్రీ గురజాడను గూర్చి రాసిన వ్యాసాలన్నారు రామారావు (ప్ర. 106) అయితే. గురజాడ ఆధిక్యాన్ని నిరూపించేందుకు శ్రీశ్రీ చూపిన ప్రధానమైన కారణాలలో ఏ ఒక్క కారణాన్నీ రామారావు కచ్చితంగా సమర్థించలేదు. పైగా పాక్షికంగా మొదటి మూడింటిని త్రోసివేస్తూ నాల్గవదాన్ని పూర్తిగా నిరాకరించారు. శ్రీశ్రీ 'రసన' సిద్ధాంతాన్ని రామారావు మిగతా అంశాల్లాగా వివరిస్తే బావుండేది. 'శ్రీశ్రీ సాహిత్య సిద్ధాంత కర్తృత్వం' విడిగా రాయవల్సిన వ్యాసమేమోమరి. చివరకు, తెలుగులో కొత్త కవిత్వానికేకాక, కొత్తదనపు విమర్శకు కూడా శ్రీశ్రీ మార్గదర్శి అనటానికి ఈ వ్యాసకర్తకు అభ్యంతరం లేదు. అయితే దాన్ని రుజువు చేయగలిగిన చారిత్రకా ధారాలు ఈ వ్యాసకర్తదగ్గర ప్రస్తుతంలేవు' అని కుటుంబరావువలె మర్యాదగా అన్నారు. కుటుంబరావు తమ వ్యాసంలో ఒకచోట 'మహాప్రస్థానం కవితలో విప్లవంతేస్తే' చరమరాత్రి 'కథల్లో విప్లవం సృష్టిస్తుంది' అన్న శ్రీశ్రీ 'చరమరాత్రి' ప్రచురణ కర్తలనుద్దేశించి 'ఈ దేశంలో విప్లవాలు అంత తేలిగ్గారావని వారు గుర్తించలేదు' అన్నారు. మహాప్రస్థానం తెచ్చిన విప్లవాన్ని analyse చేస్తూ 'మహాప్రస్థానం కలిగించింది సంచలనాన్ని. దాన్ని చూసి అనేకులు ఆనందంతోనూ, కొద్దిమంది ఆవేశంతోనూ పరవళ్లు తొక్కారు. కొన్నివందలమంది యువకులు దాన్ని కాపీకొట్టారు. అంతే జరిగిన విప్లవం' అని 'చరమరాత్రి అలాంటి సంచలనాన్నికూడా కలిగించలేదు,' అన్నారు.

సంచలనాన్ని చూచి విప్లవం అని అనుకోవటం భ్రమ అని స్ఫురింపచేసారు. (పు. 25.) రామారావు మాటలు కూడా దాదాపు ఈ కోవకే చేరినవనిపిస్తుంది.

నిజానికి కుటుంబరావన్నట్టు, విప్లవం-సంచలనం విషయంలో కేవలం పబ్లిషర్సు కేకాదు చాలామంది కవులకూ రచయితలకూ రాజకీయ నాయకులకూ భ్రమలు కనిపిస్తాయి. దిగంబర కవుల విప్లవ భ్రాంతి అట్లాంటిదే ననిపిస్తుంది.

మూడో అంశం వ్యక్తిగా శ్రీశ్రీలో ఉన్న Conflicts. వరవరరావు వీటన్నిటినీ చిత్రించినారు. 'శ్రీశ్రీకి కచ్చితమైన likes and dislikes లేవు.... శ్రీశ్రీ రాతలకూ ఆయన జీవితానికీ పొంతనలేదు.... ఆయన ఇంకా 'సదసత్సంశయం'లో వున్నాడు.... శబ్ద శక్తిమీద చచ్చేంతమోజు........ శ్రీశ్రీ దైనందిన జీవితంలో హేతువాదికాడు....' ఈ విధమైన చిత్ర విషయాలు సామాన్య శ్రీశ్రీ పాఠకుడికి కొత్తగా ఈ వ్యాసం తెల్పుతుంది. 'రావణాసురుడు రాసాడని చెప్పే శివుని స్తోత్రంమీద ఆయనకు చాలా ఇష్టం'ట. ఈ ఇష్టం శబ్దంమీద, శబ్ద శక్తిమీద చచ్చేంత మోజువల్లనేమో ! శబ్దంమీద-సవ్వడిమీదా శ్రీశ్రీకి ఎంతో మోజన్నది పన్యాల రంగనాథరావు 'పొలికేక'లో గూడా చూపించారు. ఒకసారి శ్రీశ్రీ ఆరుద్రా రంగనాథ రావింటికి పోగా, ఒక నోటుబుక్కు శ్రీశ్రీ చేతిలోబెట్టి నోటికొచ్చినవన్నీ అందులో రాయమన్నారట రావు. (నోటికొచ్చినవన్నీ అంటే నోటికొచ్చిన శ్రీశ్రీ స్వంత గీతాలని రావు ఉద్దేశ్యం కావచ్చు), శ్రీశ్రీ దేశచరిత్ర గేయంతో ప్రారంభించి బుక్కంతా నింపి, చివరకు 'ఆహింఖానా నాహింఖానా, నాహింఖానా ఆహింఖానా.... ? అంటూ ఒకరిదంతో కొన్ని పంక్తులు రాసాడట. (పొలికేక 30-1-70) ఆ పంక్తులకు సక్రియలిస్టుగా అర్థం చెప్పొచ్చునేమో గాని, నిజానికి అర్థం పర్థం కనిపించదు. శ్రీశ్రీ మోజంతటిది. అయితే ఇంత శబ్ద-శబ్ద శక్తిపై మోజున్నా- చివరిదిగా విశ్వనాథ శిష్యులు శ్రీశ్రీ 'శబ్దప్రభు' త్వాన్ని గూర్చి 'యోగ్యతాపత్రం' ఇచ్చినా 'సంస్కృత భాషా పరిజ్ఞానమే లేకుండా శ్రీశ్రీ వాడిన సాంస్కృతిక సమాసాలను చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది' (పు. 14.) అంటారు రమణారెడ్డి. శ్రీశ్రీ శబ్ద దోషాల్ని నిరూపించిన కాఖ్మారి హనుమంతరావు వ్యాసాన్ని ఉటంకించారు. రమణారెడ్డి శ్రీశ్రీని గూర్చి 'శబ్ద ప్రభువు' అని వాడనంటారు. దానికి 'నామమాత్రుడైన ప్రభువు' అని అర్థం ఉందట. కావాలని లాగితే ఏమోతప్ప దానికాఅర్థం రూఢిగా ఉన్నట్టు దాఖలాలు కనిపించవు మరి. శబ్దంపై చచ్చేంత మోజును రమణారెడ్డి చాలా వివరించారు. శబ్దశక్తి ఓ భూతం. దాన్ని సరిగ్గా Command చేయకపోతే, అదే మింగేస్తుంది. మింగేయడాన్ని రమణారెడ్డి నిరూపించారు. మొత్తంమీద వరవరరావు

వ్యాసం శ్రీశ్రీని గూర్చి వ్యక్తిగా ఎంత తక్కువ తెలుసుకుంటే, ఒకవిధంగా అసలే తెలుసుకోకుంటేనే శ్రీశ్రీమీద గౌరవం నిలుస్తుందని సూచిస్తారు. వ్యక్తిని కదిలించక పోవటమే మంచిది. నిజానికి కవిత్వం రాసినంత, రాజకీయాలు మాట్లాడినంత, ఆదర్శాలను వల్లించినంత తేలికకాదు జీవితం. జీవితం జీవితమే. అది అద్వితీయం.

వరవరరావు వ్యాసం చదివిం తరువాత, ముగ్గురితోనూ, ఇరవై మందితోనూ శ్రీశ్రీ ఇంటర్వ్యూ చదివితే, వ్యక్తి శ్రీశ్రీ విచిత్ర స్వరూపం వ్యక్తమవుతుంది. శ్రీశ్రీ సమాధానాల్లో తప్పుకోవటాలూ, అటూ ఇటూ కాకుండా దాటివేయటం, అనవసరమైన comments కనిపిస్తుంటాయి. ఆయనలోని వైవిధ్యంలాగా. 'ఆరుద్ర మీ expectations ను ఎంతవరకు fulfil చేసారు?' అన్న ప్రశ్నకు ఆరుద్ర fulfil చేయలేదనీ, దారి తప్పిపోయాడనీ అంటూ చివరి ముక్తాయింపుగా 'ఆరుద్రని ఈ రోజుల్లో అందరికంటే ఎక్కువగా అతని శ్రీమతి influence చేస్తున్నట్లున్నది' అంటాడు. అనేకమంది influence ను మోసిన శ్రీశ్రీ 'శ్రీమతి' influence ను గూర్చి చమత్కరించటం ఒక చమత్కారం. ఆరుద్ర 'శ్రీమతి' influence తో ఏమాత్రం చెడిపోయాడో మేనమామగా శ్రీశ్రీకి తెలియవచ్చునేమో గాని, సాహిత్యకంగా స్పష్టంకాదు. నాటికీ నేటికీ ఆరుద్ర దారి తప్పినట్టు దాఖలా కన్పించదు. ఇంకా firm అయినట్టే ఆయన ఇటీవలి రచన లనిపిస్తాయి. మరో చోట 'అమెరికా వాళ్ళు వియత్నాం యుద్ధంలో కూరుకు పోయినట్టుగా ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్య రచనలో కూరుకుపోయాడు' (పు. 136) అని అంటాడు. సందర్భం తెలియదు. (అందుకేనేమో ఈ వాక్యాన్ని కుండలీకరించటం జరిగింది.) ఈ పోలికలోని సామంజస్యం ఏమిటో ఆ శ్రీశ్రీకే తెలియాలె. మొత్తంమీద ఆరుద్రను అమెరికా వాణ్ణి చేసారు, శ్రీశ్రీ. మరి సమగ్రాంధ్ర సాహిత్య రచన వియత్నాం యుద్ధమా ? వియత్నాం యుద్ధాన్ని గూర్చి పునరాలోచించుకోవలసి వస్తుంది. అయితే, ఇంతకీ ఇది నాన్‌సీరియస్ కామెంట్ అనుకోవచ్చు.

ఇరవై మంది యువకుల ఇంటర్వ్యూలో దిగంబర కవుల ప్రశ్నలు చిత్రంగా ఉంటాయి. ఎంతసేపటికీ ఆ దిగంబర కవులు శ్రీశ్రీ మీద తమ గొప్ప నిరూపించుకోవటానికే ప్రయత్నంతప్ప మరోటి కన్పించదు. ఏ కొంచెమో ఉన్నా ప్రాధాన్యం దానికి nil. ఇంత తాపత్రయం ఆత్మ ప్రత్యేకతా మోహం ఎందుకో బోధపడదు. తమ 'విప్లవం' కోసం సాంప్రదాయిక మయిన 'దిగంబర' పదాన్ని

ఉపయోగించుకుంటున్న ఆ కవులు శ్రీశ్రీ సాంప్రదాయికతను question చేయటం చిత్రం మరి. ఆ కవుల ముందు కొన్ని సందర్భాలలో శ్రీశ్రీ సంజాయిషీ ఇచ్చుకోవలసిన ఇరుకులో పడిపోతాడు. 'దిగంబర కవులు తమ కవితా శక్తిని సక్రైన మార్గంలో పెట్టలేకపోయినారు.' అంటూనే, 'వాళ్లు నిజమైన కవులు' అంటారు శ్రీశ్రీ. ఈ వైరుధ్యం సరిగ్గా clear కాదు. కొన్నిచోట్ల రాజీపడటమూ కనిపిస్తుంది. 'దిగంబర కవిత్వానికీ వచన కవిత్వానికీ తేడా ఉందని మీరనుకుంటున్నారా?' అంటే, 'వచన కవిత్వ మన్నది controdiction in terms. వచనం అయితే కవిత్వంకాదు. కవిత్వమైతే వచనంకాదు' అంటూ, దిగంబర కవిత్వం ఫ్రీవెర్స్ ఫార్మ్‌లో ఉన్నది....call it అభ్యుదయ కవిత్వం....' (పు. 128) అంటాడు, తేల్చడు. మరికొంతసాగి, 'సమూలమైన మార్పునుకోరుతున్న కొత్త ఉద్యమంగా దిగంబర కవులను ఒప్పుకుంటాను' (పు. 128) అనీ అంటాడు. అభ్యుదయ కవిత్వం ఈ మార్పును కోరలేదనుకుంటున్నాడా శ్రీశ్రీ? దిగంబర కవిత్వం వచన కవిత్వమా అంటే 'call it అభ్యుదయకవిత్వం' అన్న శ్రీశ్రీ మళ్ళీ ఇట్లా అనటమేమిటి? కొంత కొంత confusion. చివరదాకా ఇట్లాగే ఉంటుంది. ఒకచోట శ్రీశ్రీ తనను కాళోజీతో పోల్చవద్దంటాడు. 'చలం–కాళోజీలది reactionarism. I am not at all a reactionary. I am Marxist.' (పు. 143) అంటాడు. చలం విషయం అట్లా ఉంచితే (ఉంచటం కష్టమే) కాళోజీని reactionary అని శ్రీశ్రీ ఎందుకన్నాడో బోధపడదు. శ్రీశ్రీ కలం మాత్రమే అభ్యుదయకరశక్తులకు అంకితమయితే, కాళోజీ కలంతోబాటు బతుకూ-డా అభ్యుదయకర శక్తులకు అంకితమయింది. కాళోజీని శ్రీశ్రీయే లూయీ ఆరగాంతో పోల్చాడు 'నా గొడవ' ఆవిష్కరణలో. నాటికీ నేటికీ కాళోజీ మారిన దాఖలా ఏమీలేకున్నా, ఆ శ్రీశ్రీయే ఇప్పుడిట్లా అన్నాడు. దాశరథిని గూర్చి గూడా రకరకాల comments చేసారు. సోమసుందర్ ప్రభృతులంతా దారి తప్పిన వాళ్ళుగానే అంటాడు. అన్నీ passing remarks. ఒకచోట, 'ఇతర వర్గం దగ్గర డబ్బు తీసుకుని వేరే వర్గానికి వోటు వేయొచ్చుగదా. ఎన్నో ఖర్చులుంటాయి....తీసుకోవలసిన అవసరం వస్తుంది' అన్న శ్రీశ్రీ ఇతర్లను గూర్చి అట్లా అట్లా comments చేయటంలోని ఔచిత్యం అర్థంకాదు, facts విషయం ఎట్లా ఉన్నా.

కన్యాశుల్కంలోని హాస్యాన్ని 'శబ్దాశ్రయ' మని కొందరంటున్నారన్న దానికి 'శబ్దాశ్రయ మన్నదాన్ని అపహాస్యం చేయాలి. అట్లా అన్నవాళ్ళపట్ల జాలి

చూపాలి. శబ్దంలేని హాస్యం ఎక్కణ్ణుంచి వస్తుంది?' అంటాడు శ్రీశ్రీ. మరి శబ్దాశ్రయ మన్నది శ్రీశ్రీకి తెలియదనుకోవాలో, లేక చమత్కరించాడనుకోవాలో అర్థంకాదు. 'దాన్ని అపహాస్యం చేయాలి' అంటే? జాలి చూపటం ఆ తర్వాత.

ఇతర వ్యాసకర్తలు శ్రీశ్రీనిగూర్చి ఆవేశంతో, ఆవేగంతో సెంటిమెంట్‌తో ఎంత రాసినా, అనవసరంగా శ్రీశ్రీ గొప్పను చెప్పే తొందరలో ఇతర్లమీద comments చేసినా, పై వ్యాసాలూ ఇంటర్వ్యూస్ మాత్రమే పాఠకుడిని నిలేసి ఆలోచించమంటాయి. శ్రీశ్రీ out of date అయ్యాడేమో చూచుకోమంటాయి మరికొన్ని వ్రాతలు. మొత్తంమీద ఈ సాహిత్య సమాలోచన శ్రీశ్రీని గూర్చి శ్రీశ్రీ సాహిత్య పరిచయంగల పాఠకుడు rethink చేయవలసిన అవసరాన్ని కలిగిస్తుంది.

—సంపత్కుమార.

విజయనగరం
12-2-'70

'సృజన' సంపాదకులకు,

'సృజన' 'శ్రీశ్రీ సమాలోచన సంచిక'లో నవీన్, శ్రీపతి, మీరు శ్రీశ్రీతో చేసిన ఇంటర్వ్యూలో

"కొందరు వచన కవితను మొట్టమొదట రాసింది శ్రీరంగం నారాయణ బాబు అంటారు, దీనిని గూర్చి మీ అభిప్రాయం ఏమిటి?" అనే ప్రశ్నకు శ్రీశ్రీ గారు ఈ దిగువ సమాధానం ఇచ్చారు.

"శ్రీరంగం నారాయణబాబు was simply an imitator. ఇంకా he was essentially an anarchist, probably an opportunist also."

శ్రీ నారాయణబాబు గారి గీతాలు బహుకాలం క్రితం నేను చాలా చదివేను. ప్రపంచకవులలో ఏ ఒక్క కవికీ నారాయణబాబు imitator కాడు. భారత దేశంలో నారాయణబాబు పద్ధతి కవిత్వం నారాయణబాబుతోటే ప్రారంభించ బడ్డాది. నారాయణబాబులో తస్కరించిన భావాలు ఎక్కడా కనబడవు. సర్వ స్వతంత్ర కవి.

వచన కవిత్వం నారాయణబాబు ప్రారంభించాడా అంటే imitator అనడంలో శ్రీశ్రీ భావం ఏమిటో బోధ పడ్డంలేదు. వచన కవిత్వాన్ని తెలుగులో నారాయణబాబే ప్రారంభించాడు. అది చారిత్రక సత్యం. ఇంగ్లీషులో వచన కవిత్వం Macphearson's 'Ossian', Walt Whitman యొక్క Leaves of Grass లగాయతూ ఉంది. ఆధునికులు ఆంగ్లభాషలో వచనంలో అనేక విన్యాసాలు ప్రారంభించారు. అయితే వాటి వేటికీ నారాయణబాబు imitator కాడు.

తెలుగులో పౌరాణికులు అనాదిగావచనాన్ని పాడ్డం సాంప్రదాయంలోవుంది. నారాయణబాబు లయబద్ధమైన వచనాన్ని కర్ణాటక సంగీత పద్ధతిని పాడుటకు వీలుగా తన గీతాలు రాసుకున్నాడు. తాను పాడేవాడు. శ్రీద్వారం వెంకటస్వామి నాయుడుగారు నారాయణబాబు పాడే పద్ధతిని ఆమోదించారు.

వచన కవిత్వానికి సంబంధించని మరో భావం కూడా వ్యక్తంచేశారు Anarchist అని. నారాయణబాబు 'కపాలమోక్షం' భగత్‌సింగు మీద రాసిన విప్లవగేయం. అనన్య సాధ్యమైన నిపుణతతో మన పౌరాణిక సాంప్రదాయం లోంచి ఆగేయం మలచబడ్డాది. తెలుగుభాషలో అంతటి వీరగేయం మరొకటి లేదంటే అతిశయోక్తికాదు. ఆగేయం దురదృష్టవశాత్తూ ప్రస్తుతం ప్రజల ముందులేదు. కీ. శే. అవసరాల సూర్యారావు మొ॥ వారు సంతరించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారిచే ప్రచురించబడిన 'కల్పన' అనే గేయ సంకలనములో నారాయణబాబు 'కపాలమోక్షం' కూడా చేర్చబడినది. నారాయణబాబు 'రుధిర జ్యోతి' గేయాలే పుస్తకరూపంలో మన ముందులేవు. ఆనాడు భగత్‌సింగు మీద నారాయణబాబు అంత ప్రసిద్ధమైన గేయం రాయడం అరాచకవాదం ఎంత మాత్రం కాదు. ఆనాడు దేశంలో వామపక్ష పార్టీలే లేవు. నారాయణ బాబు గీతాల్లో నేను చదివినంత వరకూ ఎక్కడా anarchy కనబడదు.

శ్రీశ్రీ వ్యక్తం చేసిన మరో భావం కూడా నన్ను విభ్రాంత పరచింది. నారాయణబాబు ఎన్నడూ అవకాశవాది కాడు. తాను నమ్మిన కావ్యతత్త్వాన్ని అనేక వేదికల మీద నుండి యావదాంధ్ర దేశంలో నిర్భయంగా తన గంభీర కంఠంతో ప్రజలకి ప్రతిపాదించాడు. భావకవుల పలాయన వాదాన్ని ఏ వేదిక మీదా నారాయణబాబు క్షమించలేదు. సమాజంలో కశ్మలాన్ని ఖాళితం చేశాడు. నారాయణబాబు అవకాశవాది అయితే శ్రీశ్రీతో సమానమైన స్థాయిని పొంది వుండేవాడు. నారాయణబాబు, శ్రీశ్రీలను ఆదినుండీ ఎరిగివున్న శ్రీ రోణంకి

అప్పలస్వామిగారు యిద్దరి గురించీ ఏమి రాశారో ఇక్కడ పరిశీలించడం సముచితం.

"కవిగా అవతరించిన శ్రీశ్రీని సోవియట్ రష్యా ఆకర్షించింది. శ్రీ శ్రీ సమకాలికులైన నారాయణబాబు వంటి కవులకు సైతం ఎర్రబావుటా ఉద్రేక శబలితం కాజొచ్చింది. శ్రీ శ్రీ, నారాయణ బాబులకు ఆవేశ హేతువులు, చరమలక్ష్యం నాడు ఒకటే; త్రోవలు మాత్రం వేరు (కవిత్వం పద్ధతిలో–రచయిత); ఒకరు ఎగిరే ఎర్రబావుటా పట్టుకోగా మరొకరు 'రుధిరజ్యోతి'ని వెలిగించుకున్నారు. ఒకరు వడులతో సుడులతో ప్రవహించే నదివంటివారు. మరొకరు మంద మందంగా పరువులెత్తే నదివంటివారు."

నారాయణబాబు కవిత్వానికి మనం చాలా అన్యాయం చేస్తున్నాం. నారాయణబాబు 'రుధిరజ్యోతి'ని పుస్తక రూపంలో అచ్చువేస్తే నేటి యువకులకు ఉత్సాహహేతువు అవుతుంది. ఆధునిక సాహిత్యానికి లోటు తీరుతుంది. వాతావరణం సుముఖంగా లేని కాలంలో వచన కవిత్వాన్ని చెప్పిన నారాయణబాబు ఈనాటి యువతరం మన్ననకి పాత్రుడౌతాడు.

తోటి కవిగురించి శ్రీశ్రీ అంత చులకనగా, బాధ్యతారహితంగా వచించడం శ్రీ శ్రీ అభిమానినైన నన్నే ఆశ్చర్య పరిచింది. ఈ మధ్యనే ఒక పత్రికలో పాఠకుల ప్రశ్నలకు జవాబులిచ్చే శీర్షిక శ్రీశ్రీ నిర్వహించారు. ఒక ప్రసిద్ధ తెలుగు కథారచయిత వ్యక్తిగత జీవితానికి సంబంధించిన ఒక ప్రశ్నకు ఇచ్చిన జవాబులో శ్రీశ్రీ, రచయిత వ్యక్తిగత జీవితం ప్రధానం కాదనీ, తన రచనలో ప్రజలకిచ్చే సందేశం, వారిపై అతనికి గల ప్రభావం, సంఘానికి అందువలన గలిగే ప్రయోజనం ముఖ్యమని ధ్వనించారు. అదే కవి నారాయణబాబుని anarchist అనీ, opportunist అనీ అభివర్ణించడంలో అది ఆయన వ్యక్తిగత జీవితాన్ని ఉద్దేశించో, కవిత్వాన్ని ఉద్దేశించో కూడా తెలియటంలేదు.

నిష్టల వెంకటరమణమూర్తి.

## శ్రీశ్రీ సమాధానం :

మద్రాసు,
18-4-70.

డియర్ వరవరరావుగారూ,

మీ ఉత్తరమూ, అందులో పంపిన నిష్టల వెంకటరమణమూర్తిగారి ఉత్తరమూ అందేయి. నే నే సృజన సంపాదకుణ్ణయితే శ్రీ నిష్టలవారి ఉత్తరం చెత్తబుట్టలో ఉండేది. ఆయనగారిది పౌరాణిక దృక్పథం. నారాయణబాబు సహజ కవచకుండలాలతో పుట్టేడని వారి దృఢ విశ్వాసం. వారి ఉత్తరం ఏ కృష్ణా పత్రికలోనో వేస్తే చాలా మంది భక్తులు సంతోషిస్తారు.

నిల్‌నిసీబోనమ్ (Nilnisibonum) అంటారు. చచ్చిపోయిన వాళ్ళని గురించి మంచే మనం చెప్పుకోవాలి, కాని ఆ మంచిని భూతద్దాలనుపెట్టి పెంచడం ఏమీ మంచిది కాదు.

అనుకరణ ఏ కళల్లోనైనాసరే పెద్ద నేరం కాదు. సొంత గొంతుక వెదుక్కునే దారిలో నే నెందరో కవుల్ని అనుకరించాను, అనువదించానుకూడా. "వచన కవిత్వాన్ని తెలుగులో నారాయణబాబే ప్రారంభించాడు. అది చారిత్రిక సత్యం'' అనే మాటలు చదివితే, శిష్టాదాకాఎందుకు? పూడిపెద్ది వెంకటరమణయ్యగారే నవ్వుకుంటారు. చారిత్రికంగా తెలుగులో (తిక్కన శ్రీనాథుల వచనం అలా ఉండగా) ఆధునికమైన మొట్టమొదటి వచనగీతం వ్రాసింది దువ్వూరి రామిరెడ్డిగారు. ఆ రోజుల్లో వచనగీతాన్ని మౌలికంగానూ సృజనాత్మకంగానూ డెవలప్ చెయ్యడానికి అనేకులు అనేక విధాల కృషిచేశారు. ఈ ప్రయత్నంలో ఛందస్సు మీద అధికారం ఉన్నవారికే జయం లభించింది. (ఛందస్సు శత్రువు. దాన్ని జయించడానికి దాని గురించి పూర్తిగా తెలుసుకోవాలి.) నారాయణబాబు ఉత్పల చంపకాది వృత్తాలమాట అటుండగా కనీసం ఒక కందపద్యమైనా సలక్షణంగా వ్రాయలేదన్నది నాకు తెలిసిన సత్యం. నారాయణబాబు ఇప్పుడు బతికి ఉంటే ఎలా ఉండేవాడో కాని బతికున్నంతకాలం అనుకరణ స్థాయిని మించి బతకలేదు (సాహిత్యపరంగా.)

ద్వారం వెంకటస్వామి నాయుడుగారు ఆమోదించిన నారాయణబాబు సంగీత పద్ధతితో నాకేమీ పేచీలేదు. స్కార్లెట్ దొరగారిని మెప్పించిన చెట్టుకింది ప్లీడర్ని మనం ''కన్యాశుల్కం''లో చూస్తూనే ఉన్నాం.

ఈ మధ్య నారాయణబాబుని అడ్డుపెట్టుకుని కొందరు నా మీద దాడి ప్రారంభించారు. అంతకన్న మంచి ఆయుధాల్ని వెదుక్కోమ్మని వాళ్ళకి నా సలహా.

నారాయణబాబుకి వేటిమీదా గట్టి నమ్మకాలుండేవని నాకు నమ్మకం లేదు. భగత్‌సింగ్‌మీద రాసినంత మాత్రంచేత నారాయణబాబుకి విప్లవ సిద్ధాంతం ఉందని నే నంగీకరించను. "విప్లవ ఋషిని, విద్రోహికవిని" అన్న నారాయణ బాబు మాటలు నజ్రుల్ ఇస్లాంకి బలహీనమైన ప్రతిధ్వనులు.

Anarchist, opportunist అనే మాటలకి మంచి అర్థమూ, చెడు అర్థమూ రెండూ ఉన్నాయి. నారాయణబాబు విషయంలో మొదటిది చెడు అర్థంలోనూ, రెండోది మంచి అర్థంలోనూ ఉపయోగించాను. నిజానికి జీవితంలో నారాయణబాబుకి వచ్చినన్ని మంచి అవకాశాలు నాకు రానేలేదు. (చిన్న ఉదాహరణ. నా "మహాప్రస్థానం'' గేయాన్ని 'భారతి' తిరగ్గొట్టింది. కాని నారాయణబాబు రాసిన వాటిని ప్రచురించడమే కాక తృణమో పణమో ముట్టజెప్పేది. ఒకే కుక్కపిల్లని నారాయణబాబు నాలుగైదుచోట్ల అమ్మడం కూడా నాకు తెలుసు.)

నే నేదో కుట్రచేసి నారాయణబాబుకి రావలసిన కీర్తిని రాకుండా చేశానని కొంద రనుకుంటున్నారు. కీర్తి అనేది అంత సులభంగా తస్కరించగలిగింది కాదు. సంపాదించగలిగింది అంతకన్నా కాదు. నేను స్వహస్తంతో తయారు చేసిన రుధిరజ్యోతి Press Copy ని నారాయణబాబే పారేసుకొన్నాడు.

ఈనాటి దిగంబర కవులనూ, తిరుగుబాటు కవులనూ ఎందరో దుమ్మెత్తి పోస్తున్నారు. వారి శాపనార్థాలు మాత్రమే దుమ్ములో కలిసిపోతాయి. విప్లవం చిరకాలం వర్ధిల్లుతుంది.

నారాయణబాబు శ్రీ శ్రీ లను రోణంకి అప్పలస్వామిగారు "ఆదినుండీ" ఎరిగినవారు కారు, ''ఆదిలో'' మాత్రమే ఎరిగినవారు. 55 ఎన్నికల సందర్భంలో నారాయణబాబు సంస్కృతి రక్షణపేరిట వహించిన క్షుద్రపాత్రను అప్పలస్వామిగారు అసహ్యించుకుంటారని నాకు తెలుసు.

ఆనాటి ఆంధ్రప్రభా, పత్రికల పాత్రనే ఇప్పుడు కొన్ని పత్రికలు నిర్వహించడానికి సిద్ధమవుతున్నాయి. అది తమ విద్యుక్తధర్మమనికూడా భావిస్తున్నాయి.

కాలం, ఎవరి కనుకూలంగా కదుల్తోందో అదీ త్వరలోనే చూస్తాం.

మీ మిత్రుడు
శ్రీ శ్రీ

సృజన – శ్రీ శ్రీ సమాలోచన సంచికలో చేకూరి రామారావుగారి వ్యాసంలో శ్రీ శ్రీ కి మార్క్సిస్టు పరిజ్ఞానం పరిమితం అన్నారు.

ఇది నిజంగా క్రిందుమీదులుచేసి చెప్పాల్సినది. మార్క్సిస్టులకు శ్రీ శ్రీ ని గురించిన పరిజ్ఞానం పరిమితం. శ్రీ శ్రీ తో పోల్చితే తెలుగులోవున్న మార్క్సిస్టు పరిజ్ఞానమే పరిమితం.

తెలుగు దేశంలోని మార్క్సిజం శ్రీ శ్రీ స్థాయినందుకోగల్గితే సామ్యవాద విప్లవ సాధనలో మనం కొంత ముందుకు పోగల్గుతాం.

గురజాడ విప్లవకవి అని అంటూ అది బూర్జువా విప్లవం అని రామారావు గారు అంటున్నారు. ఇది సరికాదు. అలా అనటం ఉపయోగమూకాదు.

బూర్జువా విప్లవకవి అని అంచనా కొచ్చాక దిగంబరుల థీసిస్‌ని ఏ గుండెలతో ఎదుర్కొంటారు. బూర్జువా విప్లవకవిని పొగుడుతూ కూచుంటే సామ్యవాద విప్లవకవి నిన్ను నవీన ఛాందసవాదీ అని పిలవటం అనివార్యమూ సహజమున్నూకదా !

అసలీ చిక్కంతా ఎందుకొస్తోందంటే – మనవాళ్ళంతా యీ కమ్యూనిస్టు జార్గన్‌లో బాగా కూరుకుపోయారు. బూర్జువా విప్లవకవి, కమ్యూనిస్టుల విప్లవకవి యింకా వెనక్కుపోతే ఫ్యూడల్ విప్లవకవి, బానిస కవి (విప్లవ).

గురజాడను గురజాడగా చూడక యీ పరిభాష అవుసరం ఏమిటి ?

పాతకొత్తల మేలికలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా

యీ మాటలను పట్టుకొని దిగంబరులు గురజాడది నవీన ఛాందసవాదం అన్నారు. గురజాడ అలా అనటం ఆనాడు యీనాడూ ఏనాడూ సరైనదే.

అలాగే గురజాడ యింకోచోట

వెనుకజూచిన కార్యమేమోయ్
మంచి గతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగెయ్
వెనకబడితే వెనకెనోయ్ అన్నాడు.

ఈ దృష్టి ఏనాటికీ విప్లవదృష్టే. ఇది నిర్ద్వందంగా అర్ధం జేసుకొని అంగీకరించాలి. ఈనాడు కాదు, ఆనాడు మాత్రమే విప్లవదృష్టి. ఆనాటిది బూర్జువా విప్లవం అనటం హాస్యాస్పదమూ, వక్రీకరణ అవుతుంది.

చరిత్రను, సత్యాలను, వ్యక్తులను నీకు తెలిసిన మేర మార్క్సిస్టు రంగు కళ్ళతోచూచి ఆ కొలతల్లోకి యిరికించే ఎమెచ్యూరిష్ ప్రయత్నమవుతుంది.

ఆ పదజాలాన్నించి, ఆ యినప చట్రాలనించి ఆపిడివాదాలనించి మన పురోగమన శీలురైన ఆశయశుద్ధిగల యువకులు మేధావులు యింకెన్నాళ్ళకు విముక్తు లవుతారో అన్నాళ్ళూ మన యీ దేశం యిలానే వుంటుంది.

రంగారావు

చేకూరి రామారావు సమాధానం :

గురజాడ తెచ్చింది బూర్జువా విప్లవమనే ఇప్పటికీ నా అభిప్రాయం. 'ఇది సరికాదు' అంటారు, రంగారావుగారు. అనవచ్చు. కాని కారణాలు చెప్పాలి.

దిగంబర కవుల వాదం గురజాడ నవీన ఛాందసవాది అని. నా దృష్టిలో గురజాడ నవీనుడు కాడు.

పదాలకు అర్థాలున్నై. ఆ అర్థాల అవసరం ఉన్నంతవరకూ ఆ పదాలూ అవసరమే. పదాలమీద కోపం అనవసరం.

చేరా

*VISIT*

# Sree Sai Venkataramana Medical Stores

**Dispensing Chemists, Druggists** ( Phone 11 )

*Prop:* K. KRISHNA RAO, *Registered Pharmacist*

*When you Visit*

BHADRACHALAM, Khammam Dt.

---

*VISIT*

# Lakshmi Medical & General Stores

*Partners*:

Charugulla Lakshmi Narasimha Murthy
&
Chalavadi Narasimha Rao

**Main Road, BHADRACHALAM, Khammam Dt.**

---

*VISIT ONCE*

# Bommidi Veera Raghavulu & Sons

**Chemists & General Merchants**

KHAMMAM ( S. C. Rly. )

*Also Branch at*

Gandhi Chowk, KHAMMAM.

For Every thing in Medicine

KINDLY VISIT TO

**Purna Medical**
**Fancy & General Stores**

Kala Venkata Rao Road, KHAMMAM (S. C. Rly.)

*Props*: KARNATI SRI RAMULU & Co.

---

మీకు సరసమైన మందులు కావాలంటె

బొమ్మిడి గురులింగం సన్స్

( ఫోన్ : 38 )

మందుల వ్యాపారం

ఖమ్మం

వారిని సంప్రతించండి

---

కొత్త సాహిత్య పత్రికకు హృదయపూర్వక స్వాగతం

ధ్వని

సాహిత్య త్రైమాస పత్రిక

ప్రతులకు :

ఎడిటర్,

ధ్వని,

జడ్చర్ల,

మహబూబ్‌నగర్.

# షతరంజి చేనేత సహకార సంఘం

( లి. 20.005 )

ఉత్పత్తి విక్రయశాల

మట్టెవాడ, వరంగల్.

మావద్ద అన్ని రకాల షతరంజీలు, పక్కారంగులు మన్నిక అయినవి. సరసమైన ధరలకు లభించును.

ఒకసారి మా విక్రయశాలకు విచ్చేసినచో మీకే బోధపడును.

కార్యదర్శి
షతరంజి చేనేత సహకార సంఘం.



Statement about ownership and other particulars about newspaper

## SRJANA

| | | | |
|---|---|---|---|
| 1. | Place of publication | ... | Warangal-2. |
| 2. | Periodicity of its publication | | Quarterly |
| 3. | Printer's Name | ... | Varavara Rao |
| | Nationality | ... | Indian |
| | Address | ... | Lecturer, C.K.M. College Warangal-2. |
| 4. | Publisher's Name | ... | Varavara Rao |
| | Nationality | ... | Indian |
| | Address | ... | (As above) |
| 5. | Editor's Name | ... | Varavara Rao |
| | Nationality | ... | Indian |
| | Address | ... | (As above) |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | | — |

I, Varavara Rao hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/- VARAVARA RAO,*
*Publisher.*